# జమీన్‌రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1980
సంపుటి: 57 సంచిక: 19
9-5-1986
శుక్రవారం
14 పేజీలు: రూపాయి


# ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షతకు పాపం అంజయ్య ఆశపడ్డాడా?

(మా రాజకీయ పరిశీలకుడు)

కాంగ్రెస్ రాజధాని ఎప్పుడూ ఢిల్లీయే అయినా, అక్కడకు పోకముందు హడావిడిఅంతా హైదరాబాదులో వుండేది; రాష్ట్రంలో అధికారంలో లేకపోబట్టియేమో కాంగ్రెస్‌కు సంబంధించిన కదలికలేదు; కడకు గుసగుసలరూపంలో కూడా కాంగ్రెస్‌వాదుల కార్యకలాపాలు లేవు. ఇప్పుడు పూర్తిగా కాంగ్రెస్ హెడ్ క్వార్టర్సు ఢిల్లీయేననిపిస్తున్నది.

కాంగ్రెస్ సంగతి పోయినా: హైదరాబాదే అన్నిటికీ కేంద్రమైన తెలుగుదేశం కార్యకలాపాలుకూడా స్తబ్దుగావున్నాయి. వివాదాన్ని, విస్మయాన్ని కలిగించే ముఖ్యమంత్రి ప్రకటనసైతం ఒక్కటీ లేదు! ఏమైతేనేమి ఈవారం ఆంధ్రరాజధాని రాజకీయంగా నిద్రపోతున్నదనవచ్చు.

ఈ నిద్రలో సైతం కలవరింపు వినిపించకపోవడంలేదు. పి సి సి అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు కేంద్రంలో

> రాజీవ్ మంత్రివర్గం విస్తరణా మార్పా?
>
> ★ ★ ★
>
> గట్టి నమ్మకంలో వెంగళరావు?
>
> ★ ★ ★
>
> బాగారెడ్డిగారిని తొలగిస్తారా?

మంత్రికావడం ఖాయం అనేమాట విడవకుండా వినబడుతున్నది. ఈ వదంతి హైదరాబాదులోనేకాదు, ఢిల్లీలో కూడా వ్యాప్తిలో వున్నట్టుంది. ఈ వదంతిలో ఏదో కొంత నిజమున్నదని నమ్మడానికి వేరేదాఖలాఏమీ అక్కరలేదు. వెంగళరావుగారి సంతోషమే నిదర్శనం. పార్లమెంటు సమావేశాలనంతరం కేంద్రమంత్రిగా ప్రమాణస్వీకారం చేయబోయే కళ ఆయనలో ప్రస్ఫుటంగా కనబడుతుంది. పార్లమెంటు సమావేశాల తదనంతరం అన్నది ఇప్పుడు ప్రధాని రాజీవ్ గాంధీ ఆఫ్రికాదేశాల పర్యటనతర్వాతకు మారిందనుకోండి! అదీకాక ప్రధాని ప్రస్తుతం చేయబోయేది కేవలం మంత్రివర్గ విస్తరణా, లేక సమూలమైన మార్పా అనే చర్చకూడా వుంది. జరగబోయేది ఏదైనా జలగంవారికి స్థానం వుంటుందనే కాంగ్రెస్ వర్గాలు అంటున్నాయి.

వెంగళరావుగారు వెంటనే మంత్రి అయినా కాకపోయినా పిసిసి అధ్యక్షస్థానంనుండి ఆయన తప్పుకొని మరొకరిని ప్రతిష్టించడం సంభవమంటున్నారు. వెంగళరావు సీట్లోకూర్చోబోయేది ఎవరంటే అందరికీ అనుకూలుడైన రోశయ్య అని తొలుత అనుకోవడం జరిగింది. ఇది హైదరాబాదు వూహాగానం. కాని ఈవిషయంలో ఢిల్లీ ఆలోచన మరోవిధంగా వుండవచ్చునంటున్నారు. ఎంతలేదన్నా కాదన్నా కులాల పేరిట మన రాజకీయాలలో అనివార్యం అయిపోయింది. మన రాష్ట్రంలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షతకు సంబంధించి అయితేనేమి, రాజ్యసభ అభ్యర్థిత్వానికి అయితేనేమి ఇతర కారణాల వల్లనైతేనేమి రెడ్లలో తీవ్రమైన అసంతృప్తి వున్నదనే సత్యం అగ్రనాయకత్వం గ్రహింపుకు కూడా వచ్చిందని, ఆ వర్గం వారిని కొంత సంతృప్తిపరచడానికి పిసిసి అధ్యక్షత వారికిస్తే సరిపోతుందనే ఆలోచన నాయకులలో వస్తున్నదని అంటున్నారు. ఇది వాస్తవమైతే శ్రీ రోశయ్యకు అవకాశం వుండకపోవచ్చు. ఈ పదవికి ప్రస్తుతం ఢిల్లీ దృష్టిలో మాజీ మంత్రి శ్రీ పి నరసారెడ్డి వున్నారని వార్త. నరసారెడ్డి పూర్వం ఒకసారి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేశారు. రద్దయిన శాసనమండలిలో ఆయనసభ్యుడు. అభ్యుదయ దృక్పథం కలవాడని, అనవసర వివాదాలలోకి పోడని, పెద్దమనిషని అనుకుంటారు. ఈ రోజులలో అవి ఏ రకమైన అర్హతలో పార్టీ వారికి బాగా తెలుసు!

ఇ. ఛాన్సులే ఈ పదవికి పాం వన

మాజీముఖ్యమంత్రి శ్రీ టంగుటూరు అంజయ్య ఆశపడుతున్నారని ఒక వదంతి. కాంగ్రెస్ అధ్యక్షుడు, ప్రధాని అయిన రాజీవ్‌గాంధీ మంచిచూపులో వున్నవారికే ఏపదవిఅయినా అనేది తెలిసినసంగతి. అంజయ్య మీద సదభిప్రాయంవుంటే రాజీవ్‌గాంధీ ఆయన్ను కార్మికమంత్రిత్వాన్నుండి ఎందుకు తొలగిస్తారు? అంజయ్యకు అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శిత్వం ఇవ్వబడింది వాస్తవమే. కాని ఆపదవి మంత్రిత్వం పోయినందుకు కారేకన్నీళ్ళు తుడవడానికి ఇచ్చిందేకాని, ఆయనమీద అభిమానంతో ఇచ్చిందికాదు. అగ్రనాయకత్వపు వ్యవహారసరళి తెలిసినవారికి ఈ విషయం బాగా అవగతమవుతుంది.

వీటన్నిటికంటే ఆశ్చర్యాన్ని గొలిపే వదంతి- శాసనసభ కాంగ్రెస్‌పార్టీ నాయకుడుగా శ్రీ ఎం. బాగారెడ్డి బదులు మరొకరు నియమింపబడవచ్చునని అంటున్నారు. ఆయన్ను తొలగించాలనే ఆలోచన రావడం నిజమైతే కారణం ఏమై వుంటుందా అనేది వూహించలేకున్నారు

-కొరవ 6వ పేజీలో

> చివరికది నరసారెడ్డిని వరిస్తుందా?

# మండలాల రిజర్వేషన్లలో మంత్రి మాటే వేదవాక్కా?

పంచాయతీ మండలాలేర్పడకముందే, ఎన్నికలప్రశ్న ఎక్కడిదని పంచాయతీరాం మంత్రి శ్రీ కరణం రామచంద్రరావు ఒక పంక చెప్తున్నా-ఇంకోప్రక్క తెలుగు దేశం రాజకీయవర్గాలలో మండల ఎన్నికల కలకలం మొదలైంది.

అసలు మండలాల ఎన్నికలు జరుగుతాయా లేదా అన్న సందేహం ఇటీవలి వరకు అందరిలోనూ వుండింది. అయితే చంద్రబాబునాయుడు జిల్లాల పర్యటనతో పలువురు రాజకీయ నిరుద్యోగులకు, పదవీకాంక్ష పొందుకై తపించేవారికి కొత్త ఆశలు పొటమరించాయి. చంద్రబాబు నాయుడు ఏజిల్లాలోనూ ప్రత్యక్షంగా మండలాల ఎన్నికలు జరుగుతాయని చెప్పలేదు. కానీ పరోక్ష సూచనలు మాత్రం దండిగానేచేశారు. నెల్లూరు పర్యటనలో ఆయన కొందరు ప్రముఖులకు తొలకర్లు పడగానే ఎన్నికలు ప్రకటిస్తామని "హింట్" ఇచ్చిపోయారట.

ఇంకోప్రక్క, ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు రోజుకొకటిగా ప్రకటిస్తున్న నూతన సంక్షేమ కార్యక్రమాలు కూడా ఈ ఆశలచిగుర్లకు మరిన్ని మొగలు తొడగుతున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో, వారిసమస్యలతో, అక్కడ అమలుజరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవాలని తెలుగుదేశంపార్టీ తన సభ్యులను చేస్తున్న తొందరకూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తోంది. గ్రామాల్లో

తెలుగు రాజకీయం

ఎన్ని చక్కెరకార్డులున్నాయి, ఎవరికి వున్నాయి, ఎవరికిలేవు వంటి వివరాలు కూడా సేకరించమన్నారట; చెట్లు పంచమన్నారట; క్రాంతిపథకం అమలు పర్యవేక్షించమన్నారట; ఇవన్నీ చేసినవారికే మండలాల టిక్కెట్లు అనికూడా చంద్రబాబు పరోక్షంగా హెచ్చరించాడట. మరోప్రక్క గ్రామాలలోని తెలుగుదేశం కార్యకర్తలకు ఎన్నికల కార్యక్రమం గురించి శిక్షణాశిబిరాలు ఏర్పాటు చేస్తున్నారు. నెల్లూరుజిల్లాకు సంబంధించినంతవరకు, రాపూరులలో పదిహేనేసిరోజులు ఈ శిబిరాలుజరుగుతాయట. మొత్తమ్మీద తెలుగుదేశంపార్టీ మండలాల ఎన్నికలకు సమాయత్తం అవుతున్నట్లేవుంది.

ఎన్నికలమాట ఒకట్రైతే, మండలాలకు రిజర్వేషన్లు ఇంకా పెద్దచర్చనీయాంశంగావుంది. ఏగ్రామంవెళ్ళినా రెండే రెండు ప్రశ్నలు-మామండలం రిజర్వుడు కానున్నదా? మా మండలంలో పచ్చచొక్కాలపార్టీ పక్షాన పోటీచేసేవారెవరు? రచ్చబండలదగ్గర, వీధి అరుగులమీద పల్లెటూళ్ళలో సంభాషణలన్నీ ఇవే!

మండలాలలో హరిజనులకు, గిరిజనులకు, మహిళలకు రిజర్వేషన్లుంటాయి. వెనుకబడినతరగతులవారికికూడా కొన్నిసీట్లు కేటాయించాలనే ప్రతిపాదన వుందట: కానీ అది ఇంకా నిర్ణయదశకు చేరుకున్నట్లులేదు.

సాధారణ పరిస్థితులలో రిజర్వేషన్లు జనాభా ప్రాతిపదికపై జరగాలి, ఆయా మండలాలలో కులాలవారీగా జనాభాను లెక్కించి ఎక్కడ ఎవరు అధిక్యతలో

—కొరవ 8 పేజీలో



## పినాకిని తీరం

### భక్తవత్సలురెడ్డికి వీడ్కోలు సన్మానం

ఒక్కోసారి ఒక్కోగాలి వీలుతుంటుంది. గాలి తోలేటప్పుడు ఇంకోగాలి రావాలనుకుంటే రాదు. మొహంమండే పడమటి గాడ్పులప్పుడు. పేదదీ రేపల్లని దక్షిణ పవనాలు ఎట్లా వీస్తాయి? మన నిత్యజీవితంలోకూడా అంతే, నిత్యజీవితంకంటే రాజకీయ రంగంలో ఏది పడితే అది వెలంవెర్రి! సన్మానాలు మొదలైతే ఇక వాటికి సందు వుండదు; విందులు ప్రారంభమైతే వాటికి ఎడతెరిపి వుండదు. మన జనం ఏదైనా చేయగలరు. పూలు చల్లిన చేతులతోనే పెళ్ళలా విసరగలరు; బ్రహ్మరథం పట్టిన హస్తాలతోనే బలాదూర్ చెప్పగలరు. సీజన్నుబట్టి. రాతనుబట్టి అదైనా ఇదైనా ఏదైనా అతిగానే వుంటుంది. ప్రకృతి వైపరీత్యాలకు తట్టుకొని నిలబడినట్లే ఈ 'అతి'లకుకూడా జనం అలవాటు పడిపోయారు!

ఇది సన్మానాల సీజనగా కనబడుతుంది. మొన్ననే శ్రీమతి బెజవాడ ఈశ్వరమ్మగారికి నెల్లూరులో సన్మానం జరిగింది. పాల్గొన్న పెద్దలు ఆమె సేవలను ప్రస్తుతిస్తూ మాట్లాడారు. ఎవరు మాట్లాడడానికైనా, ఆమెను జి. వ. ద్వారా ప్రజాసేవారంగంలోప్రవేశపెట్టిన స్థానిక సమితిరాజు సామంతు సుబ్బారెడ్డిగారిలాంటి వారికితప్ప, ఈశ్వరమ్మగారిని గూర్చి బయటవారికి ఏమితెలుసు? ఆమెనుగూర్చిగాని, ఆమె సేవలనుగూర్చిగాని, ఏమి మాట్లాడగలరు? సంఘసేవకు సన్మానం అన్నారుకాబట్టి సహజంగా ఆసేవలనుకొనియాడుతూ మాట్లాడువారు; అది సాంప్రదాయం, మర్యాద!

నాకు గతవారం స్ఫురించలేదు. కొంటెతనంగాకాదు - మనస్ఫూర్తిగానే నాకనిపించింది - వాస్తవానికి చమత్కారపు ముసుగువేసి చురకతగిలించే శ్రీ బెజవాడ పాపిరెడ్డిగారు ఆ సభలో ఒక వక్త అయివుంటే ఏమిమాట్లాడివుండేవారోకదా అనిపించింది! ఆయన భాషణలు వినే భాగ్యాన్ని సన్మానసంఘం కల్గించలేదు.

నేను అసలు ప్రస్తావించదలచింది ఈవారంలో జరిగిన మరోసన్మానాన్ని గూర్చి. సమితిఅధ్యక్షుడుగా ఇరవైఏళ్ళ సర్వీస్ గడిపిన సందర్భంలో శ్రీ ఆనం భక్తవత్సలు రెడ్డికి ఇందుకూరుపేటలో సన్మానం చేశారట; కార్యక్రమం అయిపోయినతర్వాత ఎక్కడో కరపత్రంలాంటి ఆహ్వానపుకాగితాన్ని చూడాను. సన్మానంకర్తలు ఎవరు, ఎంతమంది, ఏమి చేశారు, ఎట్లాచేశారు వగైరా వివరాలంతా మనకు అనవసరం

అసలు ఇప్పుడు సన్మానానికి సందర్భమేమిటి? ఇది అభినందన సన్మానమా, వీడ్కోలు సత్కారమా? జూన్ వస్తున్నది; సమితులు రద్దుకావచ్చుననే వదంతులున్నాయి. అందువల్ల భక్తవత్సలురెడ్డిగారికి మొన్నజరిగిన సన్మానం వీడ్కోలు సన్మానమే అవుతుంది. భక్తవత్సలురెడ్డిగారి రాజకీయ జీవితం సమితి అధ్యక్షతతో ప్రారంభమైంది; సమితి రద్దుతో ఆయన రాజకీయజీవితమూ రద్దవుతుందో లేక కొనసాగుతుందో చెప్పలేముకాని, దేనికైనామంచిదని ఆయనభక్తులు అడ్వాన్సుగా వీడ్కోలు చెప్పినట్లున్నారు.

నిజమే; కామధేనువులు కల్పతరువులాంటి కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి అధ్యక్షత, వి.ఆర్. కాలేజి కమిటీ అధ్యక్షతలు మినహాయిస్తే పాపం భక్తవత్సలరెడ్డి సమితి అధ్యక్షత తప్ప మరేవున్నత పదవిని అందుకోగలిగారు? ఆ సమితి అధ్యక్షతైనా రెండుసార్లు కాంగ్రెస్‌వల్లనే వచ్చింది. కాంగ్రెస్‌నువదలి ఏదో బావుకుందామని జనతాపార్టీలోదూరి ఒకసారి పార్లమెంటుకు, ఇంకోసారిఅసెంబ్లీకి పోటీచేసి పెద్దకరీరానికిక్రమకలిగించినాప్రయోజనం లేకుండాపోయింది. జి. వ. ఛైర్మన్ పదవి అడిస్తే ఆ ప్రయత్నమూ నెరవేరలేదు. సమితి అధ్యక్షత అచ్చివచ్చినట్లు భక్తవత్సలరెడ్డి ఇంకేపదవీ అచ్చిరాలేదు; అచ్చివచ్చేదేంటి, అసలు రాలేదు! నేడో రేపో అదికూడాపోతే ఏమిచేయాలి? ప్రస్తుతానికి బ్యాంకికూడాలేదు; రేపు కాలేజి వుండబోదు.... సన్మానమంటే భక్తవత్సలురెడ్డిమనసులో ఇవన్నీమెదిలాయో లేదోకాని, నాకుమాత్రం అనిపిస్తున్నది!

ఏ. సి. సుబ్బారెడ్డి రాజకీయవారసుడై వుండవలసినవాడు భక్తవత్సలరెడ్డి తాను మంత్రిగా వుచ్ఛస్థితిలో వున్నపుడే ఏ. సి., అధికార అనధికార ముఖ్యులకు సంజీవరెడ్డికి పోటీగా భక్తవత్సలరెడ్డిని పరిచయం చేశారు; సమితి అధ్యక్షుడ్నిచేశారు అయినా భక్తవత్సలరెడ్డి ఎదుగుబొదుగూ లేకుండా ఆ

—కొరవ 8వ పేజీలో

# జమీన్‌రైతు

## శోచనీయం!

విడాకులివ్వబడిన ముస్లిం అనాథస్త్రీలవిషయంలో ప్రభుత్వం న్యాయదృష్టినిసమదృష్టిని విడనాడి వ్యవహరించడమేకాదు, ఒకవర్గం ప్రజల ఒత్తిడులకు, మూఢాభిప్రాయాలకు లొంగిపోవడం శోచనీయం. ప్రధాని రాజీవ్‌గాంధీ దేశాన్ని ఇరవై ఒకటవ శతాబ్దంలోకి ముందడుగు వేయించారో, పంతొమ్మిదవ శతాబ్దంలోకి వెనకడుగు వేయించారో మంగళవారం రాత్రి పార్లమెంటు ఆమోదించిన ముస్లిం స్త్రీహక్కుల పరిరక్షణబిల్లు చూచినప్పుడు సందేహం కలుగుతుంది.

ఇది కేవలం పార్టీబలంతో ఆమోదింపబడిందితప్ప ప్రజామతంతోమాత్రం కాదు. ఈ సమస్యను ప్రజలకు విప్పిచెప్పి, వారిలో చైతన్యం కల్గించివుంటే వారు ఇటువంటి పక్షపాతపు చట్టానికి వొప్పుకొని వుండేవారుకాదు. ఏ వర్గం స్త్రీల సహాయంకోసం ఈ బిల్లు వుద్దేశింపబడిందో ఆ వర్గం స్త్రీలకు దీని మంచిచెడులను వివరించి చెప్పి, వారి అభిప్రాయాన్ని సేకరించివున్నా ఈ బిల్లుకు వారూ తమ అసమ్మతిని తెలిపివుందురు. పార్లమెంటులోనైనా ప్రధాని దీనిని తన ప్రతిష్ఠతో ముడిపెట్టి పార్టీ ఆదేశం జారీచేసి బెదిరించి బలవంతంగా వోటుచేయించుకోకపోతే పార్లమెంటూ దీన్ని తిరస్కరించివుండేది.

వారు ఏ మతానికైనాచెందనీ, ఏ కులస్థులైనాకానీ భర్తచేత విడాకులివ్వబడిన స్త్రీ పోషణ ప్రథమబాధ్యత భర్తదే అవుతుంది. ఏ మతం వుపదేశించినా, ఏ చట్టం ఆదేశించినా, ఏ కోర్టు తీర్పు చెప్పినా- అందరికీ తెలిసిన సామాన్యన్యాయం ఇది. ఇండియన్ పీనల్‌కోడ్ 125 సెక్షన్ ఎప్పటినుండో, దేశంలోని ప్రజలందరికీ వర్తిస్తున్నది. ఇంతవరకు ఇది ఏ ఒకవర్గానికి వర్తించదనిగాని, కొన్ని వర్గాలకుమాత్రం పరిమితమనిగాని వాదనరాలేదు, వివాదం తలెత్తలేదు. ఇప్పుడు శ్రీమతి షాబాను మన ప్రభుత్వ విధానాన్ని పరీక్షకు పెట్టింది; దానిఫలితమే ఈ ముస్లిం స్త్రీ హక్కుల పరిరక్షణ బిల్లు!

ఈ బిల్లు ప్రకారం విడాకులుపొందిన ముస్లింస్త్రీకి 'ఇద్దత్' కాలంగా నిర్ణయించిన మూడుమాసాలవరకు భర్తనుండి భరణం పొందడానికి హక్కువుంటుంది. విడాకులసమయంలో గర్భిణి అయివుంటే కాన్పు అయ్యేవరకు, పిల్లలు ఆమెవద్దవుంటే రెండేళ్ళవరకు వారి పోషణకు భర్తనుండి భరణంపొందే హక్కువుంటుంది, ఆ తర్వాత ఆమెగతి దుర్గతే! ఆమెకు ఏవైనా ఆస్తులుండి ఆ ఆస్తులకు వారసులైనవారు ఆమెకు మనోవర్తి ఇవ్వాలట; వారు అశక్తులైతే ఆమె ఇతర బంధువులు ఆమె పోషణభారాన్ని వహించాలట; వారూ చేతులు వెల్లికలవేస్తే వక్ఫ్ బోర్డులు ఆమెకు అన్నం పెట్టాలట. చేసుకున్న భర్తకులేని బాధ్యత బంధువులకు అంటగట్టడం ఎంతబాగుందో చూడండి! వక్ఫ్ బోర్డులు నామకార్థంగా వున్నాయి; వాటిపోషణను అవే చేసుకోలేకుండా వున్నాయి; అటువంటి బోర్డులు ఈ స్త్రీల పోషణభారాన్ని వహించగలవా? విడాకులు పొందిన ముస్లిం స్త్రీ పునర్వివాహితురాలు కానప్పుడు; చేతికి అందివచ్చిన పిల్లలు లేనప్పుడు; ఈ బిల్లు ప్రకారం అనాథగా వీధులపాలు కావాలి; ఆకలితో అలమటించాలి! ఇదీ మన సాంఘిక న్యాయం. ప్రగతిశీల దృక్పథం!

ప్రధాని దీనిని వ్యక్తిగత ప్రతిష్ఠాసమస్యగానూ, కాంగ్రెస్ పార్టీ సమస్యగాను పరిగణించి పట్టువల వహించినప్పుడు ఎవరు ఎంతవిమర్శించినా దండగే! ఏమైనా ఈ బిల్లు కాంగ్రెస్‌కు, ప్రధానికి, దేశానికి, ప్రతిష్ఠను చేకూర్చదు!



## జమీన్‌రైతు

### 50 ఏళ్ల క్రితం ఈవారం

15-5-1936

#### నెల్లూరుమీదుగా గాంధిమహాత్ముడు

మహాత్మాగాంధీగారు బెజవాడ, తెనాలి, నెల్లూరు మీదుగా 9 తేది మధ్యాహ్నం ఎక్స్‌ప్రెస్సులో మద్రాసు వెళ్ళిరి. బెజవాడ, తెనాలి, నిడుబ్రోలు, నెల్లూరు మొదలగు అన్ని స్టేషనులలో కాంగ్రెసువారును ప్రేక్షకులును మూగిరి. హరిజన నిధికి మహాత్మాజీ చేజావగా ప్రయత్నంగా రానందున ప్రజలు తృణమో పణమో వున్నమటుకు సమర్పించుకున్నారు. ఒకపూట మద్రాసులోనుండి, ఈ వేసవికి తలదాచుకోడానికి మైసూరు నంది కొండలకు వెళ్ళారు.

#### లోకాభిరామాయణం

సంతాన నిరోధన సాధన ప్రయోగమున అనేకమంది సమర్థించుచున్నారు. ఈవిషయమై స్త్రీలకు గాంధిమహాత్ముడు హితోపదేశమొసంగుచు, హరిజన పత్రికయందు తాను ఈ పద్ధతిని గర్హించుచున్నానని వ్రాసెను.

#### చక్కెర ఫ్యాక్టరీ

గత సంవత్సరం కోటవద్ద బల్లవోలులో చక్కెర ఫ్యాక్టరీ స్థాపిస్తామని కొన్నివేలు ఖర్చుపెట్టించి ఆ యుద్యమం అంతర్ధానమైంది. వచ్చే ఎన్నికలలోపల ఏదో ఒక బూరగ ప్రారంభించడానికి వెంకటగిరి సమీపంలో అన్నంపేట వద్ద చక్కెర ఫ్యాక్టరీ కడతారని, 1937 సం॥లో య 1000 లు చెరకు నాటబడునని, అందుకుగా య 200 ల విస్తీర్ణం పెంచాలని ఇందులో రైతులమూలం బావుల క్రింద య 100 లు పెంచితే య 1 కి రు 20 లు మొదలు 50 రూపాయలవరకు గిట్టునని, సంస్థానం వారు కొంటారని మొదలైన విషయాలతో వెంకటగిరి తహసీలుదారుగారు మాటుమడుగు శ్రీపురం, దందోలు, ఉప్పరపల్లి, మోపూరు, పాతనాలపాడు, తిమ్మాయపాళెం, దాదలపల్లి రైతులకు తాకీదులువ్రాశారు. మరిన్ని ఈగ్రామరైతులందరితోగూడ కుమార రాజా సాహెబ్‌గారు 10 తేదీ మాట్లాడుతారని, అందరినీ వెంకటగిరి రమ్మనిగూడ వ్రాశారు. చెరువు కట్టల మీద మట్టి వేయించడానికి దోవలేని ఈ పాలనలో 4 లక్షలు ఖర్చుచేసి చక్కెర ఫ్యాక్టరీ కట్టిస్తారట, రేపు ఒట్లిచ్చే మహానుభావులనోట్లో చక్కెర పోయడానికి. ఈ తీపిమాటలు నమ్మి ఒట్లిచ్చే రైతులుకూడా ఇంకా ఉంటారనుకుంటున్నారు.

#### వెంకటగిరి చెర్వుక్రింద రైతులగోడు

వెంకటగిరి చెర్వుక్రింద ఎండిపొయ్యే పైరు ఆ బురదనీరు పారించినా పండదు. అయినా పైరుపెట్టుకున్న రైతులకు మనస్పుండక 10 తేదినాడు ఆ బురదనీళ్లే పైరు తడపడానికి 1 ఫర్లాంగు తెచ్చారు. పక్క బంగళాలోని దుష్టగ్రహాలకు కడుపుమండి ఆనీళ్లను లంగరుఖానా తోటకు పారించుకుని, రైతులను మాడ్చారు.

## చింపిపాతలౌతున్న చేనేత బ్రతుకులు!

చేనేతకార్మికుల బ్రతుకులు రోజురోజుకీ దుర్భరమూ, దుస్సహమైపోతున్నాయి. దేశమంతటికీ వన్నెచిన్నెల చేనేతవస్త్రాలు అందించే కార్మికుల జీవితాలుమాత్రం చిగురుపాతలవలె మిగిలిపోతున్నాయి.

రోజంతా కష్టపడి పనిచేస్తే మాస్టర్ వీవర్ ఇచ్చేది ఏడురూపాయలకూలి. దీనితో తానేమితింటాడు, భార్యాబిడ్డలకేమిపెడ్తాడు? తినడానికి తిండిలేదు; వుండడానికి ఇల్లులేదు; కట్టుకోను గుడ్డలేదు. దయనీయమైన పరిస్థితి.

స్వంతంగా మగ్గంపెట్టి పనిచేయాలంటే. ఏవాడుగింటి యజమానీ నేలపై గుంటత్రవ్వడానికి ఒప్పుకోడు. నేసిన గుడ్డకు గిట్టుబాటుధరలేదు. పలుకుబడి గల్గినవాళ్లు బోగస్ సొసైటీలుపెట్టి, కార్మికులపేరుతో ఖజానాను కొల్లగొడ్తున్నారు. నిరుపేదకార్మికుల నోరుకొడ్తున్నారు.

ప్రభుత్వం చేనేతకార్మికులకు జానెడు చోటిస్తే, గుడిశో గడిశో వేసుకొని, మగ్గం పెట్టుకొని బ్రతుకుతాడు. దేశంలో లక్షలాది పేదలకు సర్వసౌఖ్యాలూ సమకూరుస్తున్న ప్రభుత్వాలు, చేనేతకారులనుమాత్రం దిక్కులేనివారుగా వదలివేయడం అన్యాయం,

నెలూరు ఎల్. రామారావు
కార్యదర్శి,
సంజయ్‌గాంధి చేనేతసంఘం.

## మేము-మీరు

### ప్రజల అభిప్రాయానికి అక్షరరూపం

విద్యావ్యాపారం నివారించడానికి అధ్యాపకులపై మీరు (ఏప్రెల్, 25) ప్రభుత్వం జరిపిన మెరుపుదాడిని అభినందిస్తూ వ్రాయడం ఆనందదాయకం. ప్రజల్లో స్పందిస్తున్న ఆలోచనలకిది అక్షరరూపం. పూర్వం అధ్యాపకవృత్తి ఒక బాధ్యతగా, ధర్మంగా నిర్వహింపబడేది. వారు గ్రామాల్లోనే కాపురముండేవారు ఇప్పుడు గ్రామాల్లోలేనిది అయ్యవార్లే! రోజుకు ఆరుగంటల ప్రయాణం, రు 20 ల ఛార్జీలు భరించడానికికూడా వెనుకాడక టౌనులలో కాపురాలు పెడ్తున్నారు. ఉదయంబడికిరావడం ఆలస్యం, సాయంత్రం వదలడం - గంటముందే!

టీచర్లుగాని. లెక్చరర్లుగాని ప్రభుత్వపరంగా వారికిలేని సౌకర్యంలేదు. మూకబలంతో అన్నీ సాధించుకున్నారు. ఉత్తమమైన భావిపౌరులను తీర్చిదిద్దుతారని ప్రభుత్వంవీరిపట్ల ఉదారంగా వ్యవహరిస్తున్నారు,

అయితే వీరే బాధ్యతారహితంగా తయారు కావడం అన్యాయం: తమ బాధ్యతలు విస్మరించి, విచ్చలవిడి అలవరుస్తుంటే తాము తయారుచేసే విద్యార్థులుకూడా గాడి తప్పుతారని వీరికి తెలియదా?

అభ్యుదయ తత్వవాదులుకూడా విద్యావ్యాపారంతో మేకం కట్టినవారినిచూసి తమ పంథాను మార్చుకోవడం ఇంకా దారుణం,

-ములుమూడి ప్రభాకరరావు
నెల్లూరు




### ఆపదలో అయ్యవారు- వదాన్యులకు విజ్ఞప్తి

మా కాలేజీకి అనుబంధమైన హైస్కూలులో వి. శ్రీనివాసులు అనే సెకండరీ గ్రేడ్ అసిస్టెంట్ టీచరుకు అత్యవసరంగా గుండె ఆపరేషన్ చేయవలసి వుంది. గుండె లోపలి రెండు కవాటాలు

—కొరవ 7వ పేజీలో

# వ్యవసాయమంటే రైతుకు విరక్తి కలిగింది ఎందువల్ల?

"పొత్తుగా మనిషి పుట్టడంలేదు.... ఇక సేద్యం చెయ్యలేము"

ఈనాడు ఏ రైతు నోట విన్నా ఇదే మాట. ఇదే నిర్వేదం, నిష్ఠూరం! పెద్ద చిన్న అనే తేడాలేదు; ఎకరం మొదలు వంద ఎకరాల రైతు వరకూ ఈ విధంగానే విసిగి వేసారి పోయినట్లు కనపడతారు ఎందువల్ల? వ్యవసాయ ఖర్చులు పెరిగినందువల్లనా? ధాన్యం ధరలు లేక వరుమానం తగ్గిపోయినందువల్లనా? ప్రకృతి వైపరీత్యాలతో ప్రతియేటా పెట్టిన పంట నాశనమవుతుండడమా? చదువులు, వైద్యాలు, ఆధునిక సౌకర్యాలకు ఆర్థికంగా పట్టణజీవితానికి రోసినందువల్ల? ఇవన్నీ, మరికొన్ని కలసి కారణం కావచ్చు; కారణం ఏదైనా అనాదిగా రైతు కుటుంబానికి చెందినవారు ఈనాడు పల్లెటూరులో వుండలేకున్నారు; ఎప్పుడెప్పుడు ఆ నరకంనుండి బయట పడదామా అని రోజులు లెక్కపెడుతున్నారు.

వ్యవసాయంలో లాభనష్టాలు కూడా ఒక ప్రధానాంశమైనా, అంతకంటే రైతును వేధిస్తున్నది బాధిస్తున్నది ఆత్మాభిమానాన్ని కోల్పోవలసిరావడం! వ్యవసాయపు పనులకు మెట్ట తలూకా లలో ఫర్వాలేదు. డెల్టాలో మాత్రం మనిషి దొరకడంలేదు. ఈ అదను ఆ అదను అనికాని, ఈరోజు ఆరోజు అని లేకుండా సంవత్సరం పొడవునా మనిషిది కరవుగానే వుంది. అనాదిగా వ్యవసాయ కూలీలుగా వున్నవారు, ఆ కుటుంబాలు వలన పోలేదు; అట్లనే వున్నాయి. కేవలం వుండడమే కాదు. పదేళ్ళ వయసు వచ్చినప్పటినుండి మగపిల్లవాడుకాని, ఆడపిల్లగాని వ్యవసాయం మీదనే ఆధారపడుతున్నారు; చదువు సంధ్యలకు పుర్వోగాలు సద్యోగాలకు పోతున్నవారి సంఖ్య చాల తక్కువ. అయినా సేద్యానికి మనుషుల కొరత ఏర్పడడమే విచిత్రం. కూలీ రేటుది ప్రతిబంధకంకాదు; కూలి ఎంత ఇచ్చినా మనిషి దొరకడం కష్టంగావుంది. దొరికినా -దోపుచికంగా, మొగమోటంగా, దయాధర్మంగా, దేవుడు వరమిచ్చినట్లు రావడం తప్ప, పనికి తగిన కూలీ తీసుకుంటున్నామనే ధ్యానమేలేదు. నిజం చెప్పాలంటే వ్యవసాయపు పనులు ఒత్తిడిగావున్న సమయాలలో కూలివాళ్ళను కాళ్ళు పట్టుకున్నంత పని అవుతున్నది; ప్రాధేయపడవలసివస్తున్నది; పనిచేసినా చేయకపోయినా కుక్కిన పేనువలె రైతు పడివుండవలసి వస్తున్నది. దీనివల్ల సకాలంలో పనులు జరక్కపోవడంకాదు, ఖర్చులు పెరిగిపోవడంకాదు, ఒకప్పుడు 'రాజు'గా బ్రతికిన రైతు ఈనాడు ప్రాణాన్ని చంపుకొని బ్రతుకుజీవుడా అంటూ కాలం గడపవలసివస్తున్నది.

> రైతును
> వేధిస్తున్నది
> బాధిస్తున్నది
> కేవలం లాభ
> నష్టాలు కాదు-
> అభిమానాన్ని
> కోల్పోవలసి
> రావడం!

సేద్యగాడు, పశువులకాపరి దొరకడం దుస్తరంగావుంది దొరుకుతారు; కాని రైతు అవసరాలకు, రైతు ఇష్టమొచ్చినట్లు పని చేయడానికికాదు;వారిచేశాసింపబడడానికి! అంతేకాదు- నిలకడతనము, నమ్మకము, యోగ్యత గత కాలపు అమూల్యమైన విలువలుగా చెప్పుకోవలసిందేకాని, ఇప్పుడు చూడడానికిదొరకవు! ఈ పరిస్థితులవల్ల వ్యవసాయరంగలో కాంట్రాక్టు పని ప్రబలిపోతున్నది. విధిలేదు; ప్రతి రైతూ ఆ పద్ధతికే మారవలసి వస్తున్నది. మారకుంటేపనిజరగదు.దీనికైనాతగినంత మంది సకాలంలో దొరుకుతారా అంటే; దానికి పడిగాపులు కాయవలసిందే!

పనిలో ఇబ్బంది పడి, సకాలంలో చేసుకోలేక, అభిమానాన్ని చంపుకొని వ్యవసాయాన్ని కనిపెట్టుకొని వున్న దానికి ఆర్థికంగా ఏమైనా లాభమున్నదా అంటే అది పూజ్యం!

వ్యవసాయానికి మనిషి దొరకడం లేదు, వ్యవసాయంలో ఆదాయమూలేదు, మరి వ్యవసాయం ఎట్లా చేయాలి? చేయకుంటే అది ఏమికావాలి? ఈ రంగాన్ని ఈ విధంగానే ప్రభుత్వం నిర్లక్ష్యంగా వదలివేయడమేనా? రైతు కుటుంబాలనేవి క్రమంగా టౌన్లకు వలసపోతే పల్లెల రూపం ఏవిధంగా మారబోతుంది? వాటి పరిస్థితి ఏ విధంగా వుండబోతుంది?

మా వూహ మరో రెండు దశాబ్దాల కాలంలో గ్రామాల రూపురేఖలే మారిపోబోతాయి. ఈనాటి రైతు వ్యవస్థ స్థానంలో కొత్త వ్యవస్థ ఆవిర్భవించబోతుంది. ఆ కొత్త రైతాంగం, కొత్త వ్యవస్థ ఎట్లా వుండబోతాయి, పరిస్థితులు ఎట్లా మారబోతాయి అంటే చెప్పలేము: కాని పూర్వపు వ్యవస్థకు, భవిష్యత్ వ్యవస్థకు పోలిక వుండదు; తలక్రిందులుగా వుండబోతుంది. నేటి రైతాంగం, నేటి గ్రామీణవ్యవస్థకు సంబంధించి ఇది సంధికాలం. భవిష్యత్తును మనం చూడలేము; మార్పులను మనం ఆపుకోలేము. అందువల్ల ఆ చర్చను వదలి వెంటనే అనుసరించదగినవిధానాలు, తీసుకోదగిన చర్యలనుగూర్చి ఆలోచించడం వుచితంగా వుంటుంది.

వ్యవసాయకూలీలు పుష్కలంగా వున్నారు; కాని వారి మనసులు మారాయి? రైతులూ ఇప్పటివరకు ఓపిక పట్టారు; భంగపడ్డారు; నష్టపడ్డారు. పూలమ్మినచోట కట్టెలమ్మినట్లు గ్రామాలలో వుండలేమనే నిస్పృహ నిరాశలతో తెగింపుస్థితిలో వున్నారు. కారణం ఏదైతేనేమి, ఎవరైతేనేమి వ్యవసాయరంగం ఆకర్షణను కోల్పోయింది. దానిని కొంతవరకైనా పునరాకర్షితం చేయడానికి చర్యలు తీసుకోవడం

—కొరవ 11 వ పేజీలో



# ★ ★ నా మాట ★ ★

## ★ కలెక్టరు గిరి చాకిరీకి పర్యాయపదమై పోయింది!
## ★ పార్టీ పదవుల్లోని మర్మమేమిటి?

కండక్టరు కొడుకు కలెక్టరౌతాడా అని కొందరు ప్రశ్నించుకుంటే, తమ బిడ్డ కలెక్టరు కావాలని మరికొందరు కలలు కంటుంటారు; కలెక్టరుతో ముఖపరిచయమేర్పడినా ఎవరెస్టు శిఖరమెక్కినంత సంబరపడేవారు కొందరైతే, వారినిచూసి ఈర్ష్యపడేవారు ఇంకొందరు. సమాజంలో కలెక్టరుకుగల విలువ, గౌరవం, హుందాతనం అంత వున్నతమైనవి. ప్రత్యక్షంగా చూచే అవకాశం, అదృష్టం, నావయస్సు నాకుకల్పించలేదుకాని, బ్రిటీషుకాలంలో కలెక్టర్ల దినచర్య, దర్పంగురించిఇప్పటికి ఎన్నికథలో విన్నపడుతుంటాము. కలెక్టర్ అంటే ఆ రోజుల్లో మహారాజే; ఆయన కత్తికి ఎదురేవుండేదికాదు ఆ పదవు లదిష్టించే వ్యక్తులుకూడా అంతే ఘనంగా వుండేవారు. రాచఠీవి ఉట్టిపడేదట వారి నడకలో!

మరి ఇప్పుడో? కలెక్టరుగిరి చాకిరీకి పర్యాయపదమైపోయింది. అధికారదర్పం అణువణువునా వ్యక్తంచేస్తూ, విలాసంగా పరిపాలనాచక్రాన్ని త్రిప్పుతుండిన కలెక్టర్లు, గుమాస్తాలవలె రాగితాలకు, క్యాంపులకు పరిమితమైపోవలసివస్తూంది. జిల్లాలో ఏమిజరిగినా బాధ్యత కలెక్టరుదే! రోడ్ల దుస్థితినుంచి రెడ్‌క్రాస్ నిర్వహణదాకా; బస్సులు నడిపించడంనుంచి బడి పంతుళ్ళ ట్రాన్స్ఫర్లదాకా; చక్కెర కార్డులనుంచి చెట్లపెంపకందాకా; పట్టాల పంపకంనుంచి పంచాయితీల పన్నువసూళ్ళదాకా; వృద్ధాప్యపు పింఛన్లు, వితంతు పెళ్ళిళ్ళనుంచి మండేఎండలు, విరుచుకపడె తుఫాన్లదాకా.... అన్నిటి బాధ్యతా కలెక్టరుదే!

> డోలేంద్ర

ఇవి చాలవన్నట్లు ముఖ్యమంత్రివస్తే పరుగులుదీయాలి; వచ్చిపోయే మంత్రులకు స్వాగత సత్కారాలు చేయాలి;

—కొరవ 8 వ పేజీలో

# చెరువు తెగితే తెగచర్ల తామరలుంటే తానంచర్ల!

చెర్ల అని చివర్నవచ్చే పేరుగల గ్రామాలు ఆంధ్రదేశంలోచాలావున్నాయి. జడ్చర్ల, కోటచర్ల, వెలిచర్ల, మొగిలిచర్ల, కంచికచర్ల వంటివి అటువంటివే. 'చర్ల' అనేది చెరువుకు సంగ్రహరూపం.

మనజిల్లాలో చేజర్ల అనేగ్రామంవుంది. నెల్లూరుకు పశ్చిమదిక్కుగా 34 మైళ్ళ దూరంలో వున్నగ్రామం మండలకేంద్రం కూడా! ఇక్కడొక చెరువుంది. గుంటూరు జిల్లాలోని చేజర్లనుంచి కొన్నివందల సంవత్సరాల క్రితం కొన్ని కుటుంబాలు ఇక్కడకు వలసవచ్చి తమ తొలినాటి నివాస మమకారంతో, క్రొత్తగా కట్టుకున్న నివాసానికి చేజర్ల అని పేరుపెట్టుకున్నట్లు స్థానికచరిత్ర. 17వ శతాబ్దంలో ఒక మహ్మదీయుడు 'దావూద్ సుల్తాన్'- తనపేరును సంస్కృతభాషలోకి అనువదించుకొని 'దావు-సురత్రాణంగా'మార్చుకొని, ఇక్కడవుండే చెన్నకేశవస్వామికి, నాగనాథం తిమ్మావధానులవారికి, దానం చేసి అష్టభోగతేజస్వామ్యములనుభవించునట్లు చేశారట. (శా. వె. బ. 23) ఇది అరుదైన విషయం.

**అమణచర్ల :**

ఇది నెల్లూరుకు ఎనిమిది మైళ్ళ దూరంలో వుంది. అమని అంటే నిండు. ఎల్లప్పుడు నిండియుండెడి చెరువుగల గ్రామం అని చెప్పుకోవచ్చు. వ్యవహారంలో ఆమణచెర్ల అయింది. ఆమంచర్ల యింటిపేరుతో ప్రసిద్ధిచెందిన కుటుంబాలవారున్నారు.

> ఊరు-పేరు

**వెడిచర్ల :** (గూడూరు తాలూకా) వెద అంటే చిన్న. చిన్న చెరువుగల గ్రామమని అర్థం.

**పాలిచెర్ల :** (గూడూరుతాలూకా) చెరువు నిండినపుడు చవిటిపాలాలలోని

—కొరవ 8వ పేజీలో

# ఎందుకు వచ్చారు? ఏమి చూశారు?

జిల్లాలో ఏర్పడిన కరువు పరిస్థితులు పరిశీలించడానికి నిన్న ఉదయం కేంద్ర బృందం వచ్చింది; మధ్యాహ్నమే తిరిగి వెళ్ళింది. కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ అధికారి శ్రీ సిన్హా, ప్లానింగ్ కమిషన్ సలహాదారుడు శ్రీ జె. వి. ఎమ్. రామశాస్త్రి, సాంఘిక సంక్షేమశాఖ అధికారి శ్రీ బి. ఆర్. సుమన్ ఈ బృందంలో సభ్యులు. రాష్ట్ర వ్యవసాయశాఖ డైరెక్టర్

## కరువు పర్యటన కానేకాదు- కార్ల రేసు!

శ్రీ పి. రమాకాంతరెడ్డి వారిని అనుసరించి వచ్చారు. కలెక్టరు శ్రీ జన్నర్ హుసేన్ బృందాన్ని స్వాగతించి, దారి చూపి, పరిస్థితులు వివరించి, నివేదిక సమర్పించారు.

ఎమ్మెల్యేలు శ్రీ ఈదూరు రామకృష్ణారెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి, బల్లి దుర్గాప్రసాద్, డాక్టర్ భాస్కరసాయికృష్ణ యాచేంద్ర, డాక్టర్ బి. సుందరరామరెడ్డి; సమితి అధ్యక్షులు శ్రీ ఎం. వి. నారాయణరెడ్డి, రాజశేఖరరెడ్డి, జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి కరువు బృందాన్ని కలుసుకొని విడివిడిగా వినతి పత్రాలు సమర్పించారు. జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారిహూజా వీరితోపాటు పాల్గొన్నారు.

అయితే ఈ కేంద్రబృందం పరిశీలించిన కామంఏమిటో, ఎక్కడచూశారో, ఏమి అర్థంచేసుకున్నారో మనకైతే బోధపడలేదు. కార్యక్రమం ప్రకారం ఈ బృందం ఉదయం 8-30 గంటలకు వెంకటగిరిలో పర్యటన ప్రారంభించాలి. వారు మొత్తం మనజిల్లాకు కేటాయించిన సమయం కేవలం ఏడంటే ఏడుగంటలు. ఇందులో భోజనాది కార్యక్రమాలకు గంట మినహాయించుకున్నారు. నికరంగా మిగిలింది ఆరుగంటలు. ఆరుగంటల్లో అక్షరాలా 30 గ్రామాలు తిరిగి, కరువుకు ఎండిన రైతుడొక్కలను, నీటిలు వారిన చెరువులను చూస్తారని పర్యటన కార్యక్రమం చెప్తున్నది.

అయితే, ఉదయం 8-30 కి వెంకటగిరి చేరాల్సిన బృందం, ఎండనడినెత్తికి ఎక్కినతర్వాత- 11 గంటలకు చేరింది. అంటే ఆరుగంటల్లో ఆలస్యం పాలు

-కొరవ 8వ పేజీలో

# ఈ నేరానికి శిక్ష లేదా?

## ఆత్మకూరు బస్టాండు అండర్ బ్రిడ్జి పని ఆగిపోవడానికి అధికారులదే బాధ్యత

ఆత్మకూరు బస్టాండు బ్రిడ్జి నిర్మాణపుపని అర్థంతరంగా నిల్చిపోయింది. తిరిగి ఎప్పుడు మొదలుపెడతారో తెలియదు; ఎన్నేళ్ళకు పూర్తిచేస్తారో అసలే తెలియదు. అప్పటివరకు సగం త్రవ్వేసిన రోడ్డులో, ఒకతట్టు నిషేధించిన ట్రాఫిక్‌తో నెల్లూరుపౌరులు అల్లాడిపోతున్నారు; అగచాట్లపాలౌతున్నారు; నరక యాతన అనుభవిస్తున్నారు. కానీ అధికారులకుమాత్రం చీమకుట్టినట్లుకూడాలేదు.

మూడులక్షలజనాభాకు, 28రాష్ట్రాల వాహనాలు తిరిగే రహదారికి సంబంధించిన, అత్యంత ప్రాముఖ్యం కల్గిన ఈ నిర్మాణ కార్యక్రమం నిల్చిపోవడానికి హైకోర్టు స్టే ఒక కారణం కానేకాదు; తమ అసమర్థతను కప్పిపుచ్చుకోవడానికి, ఆలస్యాన్ని దాచిపెట్టుకోవడానికి అధికార్లు చూపుతున్న సాకుమాత్రమే ఇది.

బ్రిడ్జి విస్తరణ చేపట్టినప్పుడు, ఇంజనీర్లు దాన్ని ఆరునెలలలో పూర్తిచేస్తామని ప్రగల్భాలు పల్కారు; ఆరంభ శూరత్వాన్ని నిరూపించుకుంటూ హడావుడిగా పని మొదలుపెట్టారు. రోడ్డును

-కొరవ 10వ పేజీలో

# శిస్తు, అప్పులవసూళ్లు: రైతాంగం హాహాకారాలు

జిల్లాలో శిస్తులు, అప్పుల దండకాలు జోరుగా జరుగుతున్నాయి. రెవిన్యూ అధికారులు లక్ష్యాలు నిర్దేశించుకుని గ్రామాలమీద పడుతున్నారు. సహకార బ్యాంకులు వ్యవసాయాభివృద్ధిబ్యాంకులు మందీమార్బలంతో, పోలీసుబందోబస్తుతో పిండారీలవలె ఊళ్ళపైకిదాడిచేస్తున్నారు. వాణిజ్యబ్యాంకులు రైతులను కోర్టుల కీడుస్తున్నాయి. ఏ పత్రిక తెరిచిచూచినా చాలు- పల్లెప్రాంతాలలోని బ్యాంకుల బంగారునగల వేలం ప్రకటనలు కుప్పతెప్పలుగా కనిపిస్తున్నాయి.

ఒకవంక మండేఎండలు, ఇంకొక ప్రక్క నీళ్లులేక, ఆఖరి తడులులేక తరకతేలిపోతున్న వరి; మొన్న జనవరి అకాల వర్షాలకు తడిసి, ముక్కిపోయి గింజలన్నీ రాలిపోవడంతో పెట్టిన పెట్టుబడులన్నీ కృష్ణార్పణమై అప్పులపాలైన ఆర్థిక పరిస్థితి; ప్రకృతి పొట్టనపెట్టుకోగా మిగిలిన అరాకొరా ధాన్యం అమ్ముకోలేని దౌర్భాగ్య పరిస్థితి....వీటన్నింటితో తల క్రిందులౌతున్న రైతాంగం నెత్తి మీద అప్పుల దండకాలు తాటికాయవలె పడుతున్నాయి. చెంపదెబ్బ, గోడదెబ్బలు తింటూ రైతాంగం హాహాకారాలు చేస్తున్నది. కరువుతాకిడికిగురైన ప్రాంతాలలో అప్పుల వసూళ్ళు వాయిదావేస్తామన్న ప్రభుత్వ వాగ్దానాలు వట్టిమాటలుగానే మిగిలిపోతున్నాయి.

నిజానికి బ్యాంకులు అప్పులివ్వడం తప్పు. తిరిగి దండికం చేయకూడదన్నది రైతాంగం అభిమతంకాదు. ఎట్లాగోట్లా అని ఆలోచించడంతప్ప ఎట్లా ఎగ్గొట్టాలి అన్నపథకాలు పన్నడం రైతు ప్రకృతికి భిన్నమైనది. పల్లెటూళ్ళలో సామాజిక పరిస్థితులు అత్యంత సున్నితమైనవి. అప్పులవాడు, అది బ్యాంకుకాని

## జిల్లావార్తలు

మరొకటికాని ఇంటికి రావడమంటే గ్రామంలో ఆరైతుకు తీరనిఅవమానం క్రిందలెక్క. అయినా అభిమానం చంపుకుని రైతులు బ్యాంకు అధికారులను త్రిప్పుకుంటున్నారంటే, వారి ఆర్థికపరిస్థితి ఎంత దయనీయంగావుందో అర్థం చేసుకోవచ్చు.

దాదాపు దశాబ్దంనుంచి గ్రామీణ ఆర్థిక వ్యవస్థ దెబ్బమీదదెబ్బ తింటున్నది. తుఫాను, వరదలు, కరువులు, తెగుళ్ళతో పదేళ్ళ ఇవతల పైరు దెబ్బతినని సందర్భమేలేదు. చేతికందివచ్చినపంట నీటిపాలైన సంఘటనలు ఎన్నో. ఈ ఏడాది వరకు చూసినా, జనవరి వానలు పంటలు నాశనంచేశాయి; ఇప్పుడు నీటికరవు మెట్టప్రాంతాలలో విశ్వరూపం ధరించి వుంది.

ఈ పరిస్థితులలో పాతబాకీలన్నీ వడ్డీతోసహా చెల్లించమని రైతు గొంతుమీద కూర్చుంటే, ఎక్కడనుంచి తెచ్చికడతాడు? జిల్లాలో ఇప్పుడు ఒక్క కేంద్ర సహకార బ్యాంకుకే 16 కోట్లు బాకీలు రావలసివుందట. అందులో పాతబాకీలు నాలుగు కోట్లయితే, ఈ ఏడాది వసూలు కావలసినవి 12 కోట్ల 36 లక్షలట.

సహకార బ్యాంకు అధికారులు పెద్ద ఎత్తున దండకాలు సాగించినా, అయితే వీరు వసూలు చేసింది ...

కున్నారట. గ్రామంలో పెద్ద రైతుగా వుండి, భూస్థితి బాగా వుండేవారిదగ్గరే కఠినంగా వ్యవహరిస్తున్నారట. జప్తులు, కోర్టుకేసులుకూడా వారికే పరిమితమట. సన్నకారు జోలికి తాము పోవడంలేదని, వారంతటవారుగా కడితే తీసుకుంటున్నామని బ్యాంకు ప్రతినిధి ఒకరు చెప్పారు. ఇప్పటివరకు వీరు అసలు 68 లక్షలు, వడ్డీ 70 లక్షలు దండారట.

వ్యవసాయాభివృద్ధి బ్యాంకులనబడే భూమితనఖాబ్యాంకులుమాత్రం కాబూలీవాలాలవలెనే వ్యవహరిస్తున్నాయి; ఆసామి తనంగా ప్రవర్తిస్తున్నారు. ప్రతిబ్యాంకు హైదరాబాదునుంచి స్పెషల్ ఆఫీసర్లను పంపారట. వారినోటికి అదుపు, అంతూ పొంతూ లేదు. పోలీసు బందోబస్తు తీసుకొని గ్రామాలమీద పడుతున్నారు. తట్టా, బుట్టా, చెంబు, తపేళ వీధిలోకి విసిరేస్తున్నారు రైతును హీనంగా కించపరుస్తూ మాట్లాడుతున్నారటకూడా! ఎదురు సమాధానం చెప్పబోయినా, తిరగబడబోయినా పోలీసులనుచూపి బెదిరిస్తున్నారట. కొద్దిగా వ్యవధి అడిగినా, రేపు మాపు

—కొరవ 12వ పేజీలో

## నెల్లూరు కబుర్లు

### విహారయాత్రికుడు

### రామానాయుడు జయంతి

'జమీన్ రైతు' స్థాపక సంపాదకుడు కీ. శే. నెల్లూరు వెంకటరామానాయుడు జయంతి సందర్భంలో ఈసారి జూన్ 3 తేది శ్రీ వి. ఎస్. ఆర్. కృష్ణ సన్మానించ బడుతారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహిస్తారు. రాష్ట్ర రైతుసంఘ కార్యదర్శి, రామానాయుడు గారిని- జమీన్‌రైతును బాగా ఎరిగిన శ్రీ వై. వి. కృష్ణారావు ఉపన్యాసకుడుగా ఆహ్వానించబడివున్నారు.

వి. ఎస్. ఆర్. ప్రస్తుతం ఏ పత్రికలోనూ పనిచేయడంలేదు; ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'ఇంటి-బయట' శీర్షికలో వివిధ విషయాలపై ఆసక్తికరంగా వ్రాస్తున్నారు.

సభ 3-6-86 తేది సా. 6-30 లకు టవున్‌హాలులో జరుగుతుంది.

జమీన్‌రైతు అభిమానకోటికంతా ఇదే మా హృదయపూర్వక ఆహ్వానం.

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు 12 తేది ఉదయం 9-30 గంటలకు మద్రాసునుంచి హెలికాప్టర్‌లో నెల్లూరు వస్తారు; బ్రదర్ శ్రీనివాసులురెడ్డి కుమారుడి కళ్యాణమహోత్సవం వీక్షించి 11 గంటలకు హెలికాప్టరారూఢుడై కృష్ణాజిల్లాకు తరలిపోతారు.

పాపం అంజయ్య యాదగిరిగుట్టకు 'యాదగిరిలో' వెళ్ళాడని గొంతుచించుకుని రంకెలేసిన ఎన్టీఆర్, వ్యక్తిగత కార్యక్రమాలకు ఇప్పుడు హెలికాప్టర్లెట్లా వాడుతున్నారోమరి!

### మంత్రుల దండు

పెళ్ళికి పెద్ద మంత్రులదండే తరలి వస్తూంది. ఇప్పటివరకు శ్రీనివాసులురెడ్డి గారితోపాటు, అడవుల మంత్రి శ్రీ మహీపాల్ రెడ్డి, గిరిజనుల మంత్రి శ్రీ జి. రామారావు కార్యక్రమాలు మాత్రం వచ్చాయి. స్పీకర్ శ్రీ జి. నారాయణరావుగారుకూడా వస్తున్నారు.

## 50 లక్షల లక్ష్యంతో దశరథరామరెడ్డి ధర్మనిధి

ఒక్కోవ్యక్తిలో ఔదార్యం ఎప్పుడు కట్టలు తెంచుకొని ప్రవహిస్తుందో, ధర్మబుద్ధి ఎప్పుడు ఎంతగా వికసించి పరిమళిస్తుందో, ఒక్కోవ్యక్తిలో శాశ్వతంగా చరిత్రలో నిలిచిపోయే కార్యాలు చేయాలనే సంకల్పం ఏ అమృత ఘడియలో చోటు చేసుకుంటుందో వూహించలేము, చెప్పలేము.

అటువంటి మహత్తరకార్యానికి పూనుకోవడంద్వారా శ్రీ అరుగుంట దశరథరామరెడ్డి చరితార్థులవుతున్నారు; తన జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నారు.

దశరథరామరెడ్డి ఇంటిపేరు 'ఎ' అంటే చాలమందికి అరుగుంట అని తెలియదు; వృత్తిపరంగా ఆయన ఆడిటరు కాబట్టి 'ఎ' అనేది దానికి సంకేతమేమోనని పెక్కుమంది అభిప్రాయం. బహుజనాభిప్రాయమే తన అభిప్రాయమూ అనుకున్నారేమో. శ్రీ దశరథరామరెడ్డి 18 12 85తేది మద్రాసులో తనపేరుతో రిజిస్టరు చేసిన ఒక ధర్మసంస్థకు "ఆడిటర్ దశరథరామరెడ్డి చారిటీస్" అని నామకరణం చేశారు

ఈ ధర్మసంస్థ కేంద్రం ప్రస్తుతానికి మద్రాసు. దీనికి పదిమంది ధర్మకర్తలను నియమిస్తూ శ్రీ దశరథరామరెడ్డి ఈ సంస్థ

—కొరకు 8వపేజీలో

## రచ్చకెక్కిన కలెక్టరు- ఇరిగేషన్ శాఖలు!

కనిగిరి రిజర్వాయర్ నీటిని అనధికారికంగా రెండవ పంటకు విడుదల చేయడం, ఇప్పుడు రెండుశాఖల మధ్య ఇద్దరు అధికారులమధ్య ప్రచ్ఛన్నయుద్ధం సృష్టిస్తున్నది; ప్రతిష్టాసమస్యగా పరిణమిస్తున్నది.

మొన్న 1 తేది జరిగిన ప్లానింగ్ బోర్డు సమావేశంలో కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ ఈ అంశం ప్రస్తావించి, అవినీతికి పాల్పడిన ఇంజనీర్లను సస్పెండ్ చేస్తానని హెచ్చరించారు. ఈ విషయమై సమగ్ర నివేదిక ఇవ్వమనికూడా ఆయన ఎస్. ఇ. ని ఆదేశించారు.

ఇదిట్లావుంటే పి డబ్ల్యు డి సెంట్రల్ డివిజన్ ఎగ్జిక్యూటివింజనీరు శ్రీ ఎస్. వి. ఎన్. కుమార్ 8 తేది డి పి ఆర్ ఓ ద్వారా ఒక పత్రికాప్రకటన పంపారు. అనధికారికంగా నీటిని విడుదలచేశారన్న కలెక్టర్ ఆరోపణ నిజంకాదని అందులో ఖండించారు మూడువేలఎకరాల తీరవజా స్థితోపహా 14400ఎకరాల ఆయకట్టు రెండవపంటకు నీరివ్వాలని అనుకున్నామని. అయితే జనవరి వర్షాలవల్ల చెరువులో నీరు పుష్కలంగావుండడం, రైతుల విజ్ఞాపనలూరావడంతో మరొక రెండువేల ఎకరాలకు అదనంగాఇస్తామని కలెక్టరుకు ప్రతిపాదనలు పంపామని, అంతకుమించి అనధికారికంగా నీళ్ళిచ్చిందిలేదని ఇ. ఇ. చెప్తారు.

ఈప్రకటన పత్రికలకు చేరినతర్వాత కలెక్టరుకు తెలిసిందట. రాత్రికిరాత్రి దినపత్రికల ఆఫీసులకు ఫోన్‌చేసి, అది ప్రచురితంకాకుండా నిలిపివేశారట.

కలెక్టరుకేకాదు, పి. డబ్ల్యు. డి. ఎస్. ఇ. కి కూడా దీనివిషయం తెలిసినట్టులేదు. సంబంధిత పున్నతాధికారులకుకూడా చెప్పకుండా, కలెక్టరుపై ఖండన వ్రాసిపంపగల్గారంటే, ఇరిగేషన్ శాఖాధికార్లకు ఏదైనా రాజకీయశక్తి అండ

—కొరకు 8వ పేజీలో







## ప్రథమ వర్ధంతి

పూజనీయులు, ప్రేమాస్పదుడు వ్యాపారదక్షుడు

### శానాతి రాధాకృష్ణయ్యగారు

స్వర్గస్తులై 13-5-86కు సంవత్సరం గడిచింది.

వారి ప్రథమవర్ధంతి కోటలో మా స్వగృహమున జరుగును.

వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి.

-: కుమారులు :-

శానాతి చైతన్యకుమార్, అనిల్, సుధీర్.

# నెల్లూరు ముచ్చట్లు

(౩ వ పేజీ కొరవ)

చేయదగిన ధర్మకార్యాలనుకూడా నిర్దేశించారు. దీనికి ప్రాంతీయ పరిధులు లేవు; దేశమంతా ఈ చారిటీస్‌కు సేవా రంగమే అవుతుంది. అంతేకాదు కుల మత వర్గాతీతమైంది దీని ఆశయం. అది కూడాకాదు- దాని సేవా సహాయకరంగం బహు విస్తృతమైంది. విద్య మొదలు సాంస్కృతిక వికాసం వరకు అన్నిరంగాలకు ఈ సంస్థ తన సహాయక హస్తాన్ని చాచవచ్చు. ముఖ్యంగా పేదల సముద్ధరణ ఇందులో ప్రథమం విశేషం. ఈ రంగాలలో ఈ సంస్థ తనకు వుచితమనుకున్న రీతిగా నిధులను వినియోగించవచ్చు.

ఈ సంస్థ సహాయక కార్యక్రమాలు 1991 లో ప్రారంభమవుతాయట. ఆనాటికి యాభైలక్షల రూపాయలైనా ఈ ధర్మనిధికి సేకరించిపెట్టాలని శ్రీ దశరథరామరెడ్డి లక్ష్యం, పట్టుదల. అంటే తాను రిటైర్ కాదలచుకున్న 1991 కి ఈ ధర్మ సంస్థ పుష్కలమైన నిధులతో పరిపూర్ణ రూపాన్నిపొంది సేవారంగంలో అడుగు పెట్టాలని ఆయన అభిలాష. ఈ ధర్మసంస్థను రిజిస్టరు చేసేనాటికి ఆయన ఆరు లక్షల రూపాయలు సేకరించగలిగినట్లుంది; ఇప్పటికి మొత్తం రెట్టింపుకు మించినా మించి వుండవచ్చు. యాభై లక్షల లక్ష్యాన్ని చేరుకోగలమనే ఆత్మవిశ్వాసం దశరథరామరెడ్డిగారిలో నిండుగావుంది.

దశరథరామరెడ్డిగారు ఈ ధర్మ సంస్థ విషయం తామగా వెల్లడించలేదు. తెలిసికొని అడిగినప్పుడు తానేదో భగవత్ కార్యాన్ని చేస్తున్నానన్నంత సంతృప్తి, సంతోషం, వుత్సాహం ఆయనలో తొణికిసలాడాయి. నెల్లూరు జిల్లావాసులెవరూ ఇంతవరకు ఇంతపెద్ద ధర్మసంస్థను నెలకొల్పలేదు, ఇంతపెద్ద నిధిని లక్ష్యంగా పెట్టుకోలేదు; ఇంత విశాల ప్రాతిపదికను ఏర్పరచలేదు. పూర్వపుణ్య విశేషమేమో ఆ ప్రాప్తం శ్రీ దశరథరామరెడ్డికే లభించింది; దశరథరామరెడ్డి చేపట్టిన కార్యం నిర్విఘ్నంగా కొనసాగాలని, ఆయన లక్ష్యం నెరవేరాలని ఆకాంక్షిస్తూ, నిశ్శబ్దంగా ఇంతమంచి పని ఇంతపెద్ద పని చేసినందుకు ఆయనను అభినందిస్తున్నాము.

## మరొక నౌక

కృష్ణాపట్నం రేవుకు 15000 టన్నుల యూరియాతో ఈవారంలో ఒక నౌకవచ్చింది. యూరియా దిగుమతి ప్రారంభమై లారీల రవాణాసందడి ఎక్కువగానేవుంది. ఈ రేవుకు వచ్చిన నౌకలలో ఇది ఏడవది.

## అలజడులు

గూడూరు ప్రభుత్వ డాక్టరునుగూర్చి మంచిమాట రావడంలేదు. ఎవరాయన?

వంగం మండల కార్యాలయంలో అడంగల్లు అమాంతం మారిపోతున్నాయని, సాక్షాత్తు రెవిన్యూమంత్రిగారి సాన్నిధ్యంలోనే ఈ ప్రస్తావన వస్తే శ్రీవారు అర్ధనిమీలిత నేత్రాలతో పెదవికదలకుండా చూస్తుండిపోయారని ఒక వార్త. ఎవరా మంత్రాధికారి? సూర్య చేస్తున్న వుద్యోగి ఎవరు?

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | పుట్టి | 1400.00 |
| బి. ఆర్. 20 | | 1350.00 |
| పిల్లిపెసలు | తూము | 170.00 |
| పచ్చపెసలు | ,, | 217.00 |
| మినుములు | ,, | 225.00 |
| మిరపకాయలు | 10 కె. జి. | 75.00 |
| | | నుండి 84.00 వరకు |
| చింతపండు | ,, | 70.00 |
| | | నుండి 120.00 వరకు |
| వేరుసెనగకాయ | ,, | 45.00 |
| | | (పుట్టి రూ 2070.00) |
| వేరుసెనగ నూనె | 10 కె. జి. | 154.00 |

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 13.55 అ. |
| సర్వేపల్లి | 6.00 అ. |
| నెల్లూరు చెరువు | 13.05 అ. |

## జనవాణి

(౩వ పేజీ కొరవ)

దెబ్బతినడంవల్ల, ఓపెన్‌హార్ట్ సర్జరీ అవసరమని మద్రాసు హృద్రోగ నిపుణులు సలహా ఇచ్చారు.

ఈ శ్రీనివాసులు కుటుంబం పేదరికంతో బాధపడుతూంది. వెనుక ముందు ఆదుకునే బంధువర్గంలేదు. సంతానం, పసివయస్సులో వున్నారు. కుటుంబ ఆర్థికపరిస్థితి, దాదాపు 50 వేలు వ్యయమయ్యే ఈ శస్త్రచికిత్సకు బొత్తుగా అనుకూలమైనదికాదు. ఆపరేషను జరగకుంటే ప్రాణానికే ప్రమాదం.

దిక్కుతోచనిదశలో, కడు దీనస్థితిలో వున్న బడుగు బడిపంతులును ఆదుకోవలసిందిగా, శక్తిమేర చేయూత నందించవలసిందిగావిజ్ఞప్తి చేస్తున్నాను. వివరాలు నా చిరునామాకు పంపవచ్చు.

బాపనపల్లె వెంకటసుబ్బయ్య
కోవూరు ప్రిన్సిపల్
టి. ఎన్. సి. ప్రభుత్వ జూనియర్ కాలేజి



## సవరణ

2-5-86 తేది జమీన్‌రైతు 11వ పేజీ పల్లూరు గ్రామపంచాయతి టెండరు ప్రకటనలో టెండర్లు స్వీకరించుటకు ఆఖరు తేది 5-5-86 బదులుగా 12-5-86 అని సవరించుకోమనవి.

-డి. రవిచంద్రారెడ్డి,
సర్పంచ్.



**జమీన్‌రైతు చందా**

| | |
|---|---|
| ఆరు నెలలకు | 26.00 |
| సంవత్సరానికి | 50.00 |
| విడి ప్రతి | ఒక రూపాయి |

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

బారెక్స్-నెల్లూరు.

### బంగారు నగలు వేలం

ఈ క్రింద తెలియబరచినవారు మా బ్యాంకులో బంగారు నగలు కుదువ వుంచి విడిపించుకొననందున నెల్లూరులోని మా బ్యాంకు ఆవరణములో 17-5-88 తేది మధ్యాహ్నం 3 గంటలకు బహిరంగముగా వేలం వేయబడును. వేలంలో పాడదలచినవారు రూ. 500/- ధరావత్తు చెల్లించి పాటలో పాల్గొనవలయును. ఇతర వివరములు బ్యాంకు పని చేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

Agl. 27/18; GL. 27/420, 530. 609, 654; 28/4, 40 65. 69, 118. 147, 160, 161, 168, 242. 262, 307, 313, 325, 370, 392; 29/68, 72, 239, 315. 333, 334, 368A 383, 418A, 442. 451, 470. 475, 499, 505. 519, 553, 564, 577, 598, 603, 613, 626, 634, 666, 667, 691, 701. 717, 736.

1) వేలములో పాల్గొనదలచినవారు రు. 500-00 ధరావతు చెల్లించవలెను
2) పై నదహరించబడిన లోను నెంబర్ల ప్రకారము ఒక్కొక్క లోనులోని వస్తువులు ఒకటిగా వేలమువేయబడును.
3) వేలంలోని వస్తువులను పాటహెచ్చుగా పాడినవారికి ఇవ్వబడును. అట్లు పాడినవారు పైకము తక్షణమే చెల్లించవలె యును. అట్లు చెల్లించనియెడల ధరావతు మొత్తము వాపసుచేయకుండా వుంచుటకు బ్యాంకువారికి అధికారము కలదు.
4) ఏ ఆభరణమునకైనను, బ్యాంకు వారికి రావలసిన కనీసపుధర రానియెడల సదరు వస్తువులను వేలం వేయకుండా నిలుపుటకు బ్యాంకువారికి అధికారముగలదు.
5) వేలంతేదిని అవసరమైనయెడల వాయిదా వేయబడును. లేదా వేలం మధ్యలో నిలుపుటకు బ్యాంకువారికి అధికారముకలదు.
6) ఈ వేలం విషయంలో తుదినిర్ణయం బ్రాంచి మేనేజరువారిదే.
7) వేలంవేయబడు వస్తువుల వివరములు బ్యాంకుపనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

బ్రాంచి మేనేజరు

# శివారెడ్డి పద్యాలు

### ట్యూషన్లు

బ్రదుకుతెరువులేక మాస్టర్లు ట్యూషన్లు
చెప్పుకుంటె అదొక తప్పుక్రింద
లెక్కగట్టు తెలుగు తిక్కసామ్రాజ్యమ్ము,
తిన్నదరిగెదెట్ల మిన్నకుంటె!

కొల్లగొట్టి ప్రజల కోట్లు సంపాదించు
తప్పుక్రిందరాదు తన్నుదియ్య,
చదువుసామునేర్పి పదికాసులార్జిస్తె
అదొక పెద్దనేరం అతిగెదెవరు!

ఇంటిబాడుగెంత, ఉల్లాలిచీరెంత
కాయగూరలెంత, కరెంటెంత,
బస్తబియ్యమెంత బళ్ళల్లొ మీరిచ్చె
దాలిదాల్సి ముష్టి కాల్చియెంత?

### చంద్రబాబునాయుడు

తిరగబోకు కాళ్ళుదీస్తాయి పూరూరు
పల్లెపల్లె యిప్పుడల్లపోదు
పసుపుపచ్చజెండ, పరవాల కొన్నాళ్ళ
పాటు చంద్రబాబు! పళ్ళవగవు!

నన్నునీకుదెలును నిన్నునాకూదెలును
క్రొత్తగాదు, కవిని మెత్తబడ్డ
తెలుగుదొరతనంలొ కొలువొక్కటిప్పియ్య
మామగార్ని ఎట్లొ మాగిసెయ్య!

### బెజవాడ ఈశ్వరమ్మ

సత్కరించె టౌను సన్మానసభజేసి
ఈశ్వరమ్మగార్ని ఎంతగానొ,
ఇదిప్రతిష్ఠ బచ్చిలిది గర్వకారణ
మ్మొకవిధంగ కాదు ఒకతెమో త్రి!

### మే డే

రష్య అంటె బ్రహ్మరథము బట్టేస్తారు
మడిమలొత్తుతారు మాస్కొ అంటె
అయ్యొదేమి దీంతొ అలవాటు పోసీర
ఏడబట్ట మేడే. వేలం వెర్రి!

## అంజయ్య

(మొదటి పేజీ తరువాయి)

ప్రతిపక్ష నాయకత్వానికి చాలలేదనా? రాజ్యసభ క్రాస్ ఓటింగునుబట్టి పార్టీ సభ్యులను ఏకత్రాటిమీద నడిపించడంలో విఫలుడయ్యాడనా? ఏ కారణమో తెలియదు!

రాష్ట్రంలో కాంగ్రెసు, కాంగ్రెస్ నాయకులకు సంబంధించిన పూహలు వదంతులు, ఇవైతే ఢిల్లీ రాజకీయ పరిణామాలనుగూర్చికూడా చర్చించడం జరుగుతోంది. కాంగ్రెస్ వర్కింగ్ ప్రెసిడెంటు శ్రీ కమలాపతి త్రిపాఠీ ఎగురవేసిన అసమ్మతి బావుటా పార్టీనుండి ప్రణబ్ బహిష్కరణతో వాలినట్లేనా? పార్టీలో ప్రారంభమైన కుట్రను రాజీవ్‌గాంధీ మొగ్గలో తుంచివేయగలిగినట్లేనా? 'రాజీవ్' షాక్ ట్రీట్‌మెంటుతో వివిధ రాష్ట్రాలలో అసంతృప్తి వాదులు భయపడి దారికి వచ్చినట్లేనా? ప్రధాని తన మంత్రివర్గాన్ని విస్తరిస్తారా లేక మంత్రి వర్గాన్ని సంపూర్ణంగా తనవారితో నింపుకోడానికి సమూలంగా మార్పు చేస్తారా? పంజాబ్ కల్లోలం, పార్టీలో అంతరంగిక వ్యతిరేకతలు సద్దుమణిగేదాకా మంత్రివర్గంలో ఎటువంటి మార్పులూ చేయరా? ....ఇవన్నీ చర్చనీయాంశాలుగా వున్నాయి. మంత్రివర్గ విస్తరణ జరిగినా, సమూలంగా మార్పబడినా మన పి. వి. నరసింహరావు. శివశంకర్‌గార్ల స్థానాలకు భంగం కలగకుండడమేగాక, అదనంగా వెంగళరావుకు స్థానం లభించవచ్చుననేదే సర్వత్రా అనుకోబడుతున్నమాట! ★

## ఇరిగేషన్ శాఖ

(6 వ పేజీ తరువాయి)

వుందా అనే అనుమానం కలుగుతుంది.

ఎస్. ఇ. కూడా కలెక్టర్‌పై పరోక్షంగా బాణాలు విసిరియాలు సూరుతున్నట్టున్నారు. ఎగ్రికల్చర్ అంజనేరు పత్రికా ప్రకటన ఇవ్వడం పై కలెక్టరు కోపగించుకున్నారనీ చెప్తే -ఆయనకు మాశాఖలో రెండవ పంటకు అనధికారికంగా నీళ్ళిచ్చింది లేనిదీ తెలుసుకోవడానికి రెవిన్యూ, ఇరిగేషన్ శాఖలు సంయుక్తంగా దర్యాప్తుచేయాలని, పత్రికలలో ఇందుపై వచ్చిన వార్తలు, అంకెలు అసత్యాలని ఎస్. ఇ. చెప్తున్నారు.

మొత్తంమీద ఈ రెండుశాఖలూ రచ్చకెక్కాయి. పి. డబ్ల్యు. డి. అధికార్లు సెల్ఫు అమ్ముకున్నది వాస్తవమని రిటైర్డు లాయరు క్రింద గ్రామాలలో విచారిస్తే చెవిటివాడికైనా వినబడుతుంది. రెండు నెలల క్రితం మే ఈ అవినీతి అంశాన్ని గూర్చి మేము వ్రాయడం జరిగిందికూడా! ఇరిగేషన్ అధికారులు తమ తప్పును కప్పిపెట్టుకోవడానికి కలెక్టరును నిందించడం అంతా పెద్దత ప్పే అవుతుంది. ఈ విషయంలో జన్మక్ హుసేన్ వైఖరి ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబిస్తున్నది.

తమశాఖతో పోల్చానికి కలెక్టరెవరని, ఎస్. ఇ. ప్రశ్నించడం అతి అనిపిస్తుంది. కలెక్టరు జిల్లా సర్వాధికారి. జిల్లాలో ఏమిజరిగినా బాధ్యత ఆయనదే! పైగా ప్రజలు న్యాయం కోరేదికూడా ఆయననుండే!

ఇంతకు, కలెక్టర్‌పై ఒక క్రిందిఉద్యోగి ఖండనను పంపితే, దానికి అధికారముద్రవేసి పత్రికలకు డి. పి. ఆర్. ఓ. ఎట్లా విడుదలచేస్తారో, ఏలోకంలోవుండిదేకాదో ఆశ్చర్యం! ★

## ప్రకటన

ఇందుమూలముగా యావన్మందికి తెలియజేయడమేమనగా నా కక్షిదారు నెల్లూరుజిల్లా నెల్లూరుటవును మూలపేట బట్వాడిపాళెం కాపురస్తురాలు నందిపూడి పెంచలయ్య కుమార్తె అయిన లోద్రమ్మ అను ఆమె తండ్రి సుమారు 15 సంవత్సరములక్రితం చనిపోగా, సదరు లోద్రమ్మ తల్లి అయిన నందిపూడి వెంకటరత్నమ్మ తన భర్త ద్వారా ఆమెకు సంక్రమించిన షెడ్యూలు దాఖలాఆస్తిని 21-5-73 తేదిన వీలునామాద్వారా మా కక్షిదారునకు సంక్రమింపజేసినది. అది లగాయతు మాకక్షిదారు షెడ్యూలు దాఖలా ఆస్తిని సర్వ హక్కుభుక్తములతో అనుభవిస్తూ మునిసిపాలిటివారికి చెల్లించవలసిన పన్నులు వగైరా తానే చెల్లిస్తూ, సదరు షెడ్యూలు దాఖలా ఆస్తిని స్వాధీన అనుభవ సర్వహక్కులు కలిగి అనుభవించుచున్నది. యిట్లుండగా, మా కక్షిదారు 1979 సం.లో అనారోగ్య పరిస్థితిలోవుండి మనస్థిమితములేని సమయములో ఆమె అక్క కుమారుడైన గ్యారా ఇంద్రకుమార్ అనే వ్యక్తి మా కక్షిదారును మోసగించి, ఏవో ఖాళీ కాగితములపై సదరు లోద్రమ్మ వేలుముద్రలు వగైరాలు వేయించుకొని షెడ్యూలు దాఖలా ఆస్తిని 11-10-79 తేదిన తన పేరట సెటిల్‌మెంటు దస్తావేజు సృష్టించుకొని యున్నారు దర్మిలా సదరు గ్యారా ఇంద్రకుమార్‌చేసిన మోసకరమైన కుట్ర కార్యమును తెలుసుకొని మా కక్షిదారు 15-3-83తేదిన లోగడ 11-10-79 తేదిన సదరు గ్యారా ఇంద్రకుమార్ సృష్టించిన సెటిల్‌మెంటు దస్తావేజును రద్దుపరుస్తూ రివొకేషన్ దస్తావేజును నెల్లూరు సబ్ రిజిస్ట్రారువారి కార్యాలయములో రిజిస్టరు చేయించుకున్నది. సదరు గ్యారా ఇంద్రకుమార్‌కు షెడ్యూలు దాఖలా ఆస్తికి ఎలాంటి హక్కు భుక్తములేవు షెడ్యూలు దాఖలా ఆస్తిపై మా కక్షిదారుకు మాత్రమే సర్వహక్కులు కలిగియున్నది. షెడ్యూలుదాఖలాఆస్తిని ఎవరైననూ అన్యాక్రాంతము చేయబడినయెడల అట్టి అన్యాక్రాంతములు చెల్లనేరవు. అట్టి అన్యాక్రాంతములకు మా కక్షిదారుకు ఎలాంటి బాధ్యతలు ఉండనేరవని ఇందుమూలముగా హెచ్చరిక చేయడమైనది.

ఆస్తి షెడ్యూలు

నెల్లూరు డి. రి. యిలాకా నెల్లూరు రిజిస్ట్రారులో చేరిన నెల్లూరు టవును మూలాపేట బట్వాడిపాళెంలోని వార్డు నెం. 24 రు. డోరు నెం. 776 రు గల పూరి ఇల్లు, ఖాళీ స్థలమునకు హద్దులు: (తూ) నందిపూడి చిన్నమ్మ ఇంటి గోడ (ద) వీధి (ప) గుర్రం కొండయ్య ఇల్లు (ఉ) గుర్రం చిన్నయ్య ఇల్లు ఈ హద్దులలో 12 అంకణములు (80 248) చ మీ. స్థలమున్నూ, ఇందులో సుమారు 3 అంకణములు (20 268) చ.మీ. పూరియిల్లున్నూ పైనప్పు అడుగు స్థలం యావత్తు ఈజమెంటు హక్కులు,

నెల్లూరు
5-5-86

-బొజ్జి యోహాను
అడ్వకేటు,



శ్రీ రంగనాథ పరబ్రహ్మణేనమః

శ్రీ తల్పగిరి రంగనాథస్వామివారి

## చందనాలంకార సేవ - ఆహ్వానము

14-5-86 నుండి 16-5-86 తేది వరకు

14-5-86 తేది రా॥ 7 నుండి 9 గంటలవరకు
తిరుపతి, మాస్టర్ చక్రవర్తి, దాసులతవారిచే వయోలిన్
ఉభయకర్త: టి. సుబ్బారెడ్డి

15-5-86 తేది రా॥ 7 నుండి 9 గంటలవరకు
నెల్లూరు, మిట్టదొడ్ల సావిత్రి బృందంచే భరతనాట్యం
ఉభయకర్త: రామకృష్ణా ఎలక్ట్రికల్స్

16-5-86 తేది సా॥ 6 నుండి 9 గంటలవరకు
శ్రీ తల్పగిరి రంగనాథస్వామివారి మూలవరులకు
చందనాలంకార సేవ-దర్శనము
ఉభయకర్తలు: మాగుంట సోదరులు

16-5-86 తేది రా॥ 7 నుండి 10 గంటలవరకు
హైదరాబాద్, స్వాతి శోభనాద్రి వారి బృందం భరతనాట్యం
ఉభయకర్త: ఎ. అశోక్ రెడ్డి

భక్తులెల్లరు శ్రీ స్వామివారిని దర్శించి తరించ ప్రార్థన.

ధర్మకర్తల మండలి — కార్యనిర్వాహణాధికారి



## నిర్యాణము



19-5-1922 3-5-1986

జొన్నలగడ్డ కామాక్షమ్మ

3-5-86 తేది శనివారం రాత్రి గం. 10 లకు స్వర్గస్తురాలైనది.

నెల్లూరు ద్రోణంరాజువారి వీధి లోని మా స్వగృహమునందు

12-5-86 తేది దశాహము జరుగను

జొన్నలగడ్డ కృష్ణయ్య (భర్త)
ప్రిన్సిపాల్,
శ్రీ కృష్ణా టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్, నెల్లూరు.

జె వి యస్. ఆర్ యస్. ప్రసాద్ (కుమారులు) జె పి లక్ష్మి (కోడలు)

కుమార్తెలు, అల్లుళ్ళు, మనవలు, మనవరాళ్లు,

## టెండరు ప్రకటన

ఇందుకూరుపేట మండలం, ముదివర్తి పాళెం గ్రామపంచాయతీకి వీధిలైట్లకు బల్బులు, హోల్డర్లు, చౌకులు, నాలుగు అడుగుల ట్యూబులు, స్టార్టరు హ్యాండిల్సు వైరు మొదలగువాటిని మరియు బోరింగు లకు విడిభాగములు సరఫరాచేయుటకు రూ 50/- లు ధరావత్తు చెల్లించినవారి వద్దనుండి 24-5-86 తేది మధ్యాహ్నం 3 గంటల లోపల టెండర్లు స్వీకరించ బడును. ఇతర విషయములు పంచాయితీ ఆఫీసువద్ద తెలుసుకొనవచ్చును.

రాగాల సుబ్రహ్మణ్యం

సర్పంచ్

ముదివర్తిపాళెం గ్రామపంచాయితీ

మర్రిపల్లె గ్రామపంచాయితీ

పొదలకూరు మండలం

మర్రిపల్లె గ్రామపంచాయితీకి 1986-87 సం॥నకు కావలసిన ట్యూబ్‌లైటు సెట్సు, మరియు 1) 40 వాట్స్ ట్యూబులైట్లు 4 అడుగులు 2) 40 వా॥ బల్బులు 3) చౌకులు 4) స్టార్టర్లు 5) హోల్డర్సు 6) వైరు వగయిరా సామానులు దఫాల వారీగా సప్లయిచేయుటకు అథరైజ్డు డీలర్లనుండి సీలువేసిన టెండర్లు 19-5-86 తేది మధ్యాహ్నం 3 గంటలకు లోపల గ్రామపంచాయితీ కార్యాలయమువద్ద సర్పంచ్ గారిచే తీసుకొనబడును. టెండర్లు అదేరోజు సాయంత్రము 4 గంటలకు టెండరుదార్ల సమక్షమున పరిశీలించబడును.

టెండరు ధరావత్తు రూ. 50/-లు

మిగతా వివరములు పంచాయితీ ఆఫీసులో తెలుసుకొనవచ్చును.

పుల్లయ్యగౌడ్ - సర్పంచ్





నెల్లూరు జిల్లా బలిజ సేవా సంఘము

## సంతాప సందేశం

పూజ్యులు, ఈ సంస్థ గౌరవ సలహాదారుగా వుంటూ వారి అమూల్య సలహాలతో సంఘ ప్రగతికి తోడ్పడుతుండిన

**శ్రీ దర్శి చెంచురామయ్య**

కందుకూరు

గారి మరణానికి చింతిస్తూ వారి ఆత్మకు శాంతి చేకూరి వారి ఆశయాలు నెరవేరాలని ఈశ్వరుని ప్రార్థిస్తూ వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపాన్ని అందజేస్తూ సంఘ కార్యక్రమాలకు 14 రోజులు సంతాపదినాలుగా ప్రకటిస్తున్నాం

నీలకంఠం మునికుమార్‌నాయుడు

అధ్యక్షులు

చిన్నచెరుకూరు గ్రామపంచాయతి

## టెండరు నోటీసు

తోటపల్లిగూడూరు మండలము చిన్న చెరుకూరు గ్రామపంచాయతికి 1986 87 సం.లకు 40 వాట్స్ స్ట్రీట్ బల్బులు, 4' ట్యూబులైట్లు, చౌకులు, స్టార్టర్లు, వైర్లు, విడిభాగములు క్రొత్తవి 4' ట్యూబులైట్లు, ఫిట్టింగ్సు మొదలగునవి దఫాలు వారీగా సరఫరా చేయుటకు క్రాంప్టన్, ఆప్టిమా అథరైజ్డు డీలర్లనుండి మాత్రమే. ధరావత్తు రు.25/-, మరియు బోర్‌వెల్ విడిభాగములు 1986-87 సం.నకు సరఫరాచేయుటకు ధరావత్తు రు. 25/-. టెండర్లు 22-5-86 ఉదయం 11గం.కు స్వీకరించబడి 11-30 గం.కు హాజరైన టెండరుదార్ల సమక్షమున తెరవబడును. వివరములు ఆఫీసు పనిచేయుకాలములో తెలుసుకొనవచ్చు.

-ఉయ్యాల యానాదయ్య, సర్పంచ్

మండపం గ్రామపంచాయతి

## టెండరు నోటీసు

నెల్లూరు జిల్లా, తోటపల్లిగూడూరు మండలంలోని, మండపం గ్రామ పంచాయతికి 1986-87 సం.నకు ఈ క్రింద చూపబడిన కరంటు సామాన్లు సప్లయి చేయుటకు 19-5-86 బుధవారము సా. 3 గం.ల లోపల మండపంలోని సమితి ప్రాథమిక పాఠశాలవద్ద సర్పంచ్ వారిచేగాని, వారి అనుమతి పొందిన వారిచేగాని అథరైజ్డు డీలర్లనుండి టెండర్లు స్వీకరించబడును. అదేరోజు సా. 3-30 గం లకు హాజరైన టెండరుదార్ల సమక్షమున టెండర్లు తెరవబడును. ప్రతి టెండరుదారుడు బటంనకు ఎదురుగా తెలిపిన విధముగా డిపాజిట్టు చెల్లించి రశీదు టెండరుకుజతపరచవలయును. కాలపరిమితి దాటిన టెండర్లు మరియు అసంపూర్ణమైన టెండర్లు స్వీకరించబడవు. మిగతా విషయములు సర్పంచ్‌గారినిఅడిగితెలుసుకొనవచ్చును.

ట్యూబులైటు సెటు 1-కి (చౌకు, స్టార్టరు, హోల్డరు, క్లాంపులు వగైరాలతో) మరియు 4' ట్యూబులు 40 వాట్స్ స్ట్రీట్ బల్బులు, చౌకులు, 1/18 కాపర్‌వైరు స్టార్టర్లు వగైరాలు సప్లయి చేయుట.

మరా మైసూరు కస్టమర్లకు ప్రాధాన్యత ఇవ్వబడును.

-యన్. మునికృష్ణయ్య

సర్పంచ్ జీలార్తి

## పినాకినీతీరం

(3 వ పేజికొరవ)

సమితిస్థాయిలోనే వుండిపోవడానికి కారణమేమి? ఆనం కుటుంబంలో ఏ.సి.తర్వాత ఇద్దరు మంత్రులయ్యారు, ముగ్గురు ఎం.ఎల్.ఏ.లయ్యారు; అయినా భక్తవత్సలం రాజకీయంగా శాపగ్రస్తుడు కావడానికి హేతువేమిటి?

రెండు కారణాలు కనబడతాయి. ఒకటి - భక్తవత్సలరెడ్డి రాజకీయరథం ఎత్తుకుంటూనే దారితప్పింది; ప్రధాన మార్గాన్ని వదలి ప్రక్కమార్గాన్ని పట్టింది; అన్నివిధాలుగా అగడ్తలో పడినవారికి అదే వైకుంఠం అంటారే; అట్లా భక్తవత్సలురెడ్డి రాజకీయ జీవితసర్వస్వం సమితే అయింది! దానితోనే ప్రారంభమైంది; దానితోనే ముగుస్తుందో ఏమో చెప్పలేము! రెండు- ఆయనలో వున్నతమైన ఆలోచనలు, వున్నతమైన లక్ష్యాలు లోపించడం; ఐద్ధకం నిర్లక్ష్య ప్రవృత్తి భక్తవత్సలురెడ్డి అభివృద్ధికి ప్రతిబంధకాలై వుండవచ్చు. దగ్గహస్తం కాదుగాని, భక్తవత్సలురెడ్డి చేతిని శూన్యహస్తమనవచ్చు. తాను చేపట్టిన ఏపదవిలోనైనా తనగుర్తును ఏమి మిగిల్చాడు? తనపేరును ఏమి నిలబెట్టుకున్నాడు?

భక్తవత్సలం మూడుసార్లు సమితి అధ్యక్షుడైతే తన స్వంతవూరు అభివృద్ధి వెలుగునే చూడలేదు; కనీస సౌకర్యాలకే నోచుకోలేదు; కడకు ఎన్నికలనుబహిష్కరించి తన పరువునే నిట్టనిలువున కడిగివేసింది! బ్యాంకి వుంటే రెండుసార్లు ప్రెసిడెంటు అయ్యాడు; కాని మంచి ఏముంది చెప్పుకోవడానికి? వీధినపడిన వి. ఆర్. కాలేజి వ్యవహారం సరేసరి!! మంచిపని, మంచి ఆలోచన, మంచిమనుషులు, మంచిమనసులు అతనికి సరిపడనే పడవు. ఆయన మాటలలోని నిష్కాపట్యం చేతలలో ప్రతిబింబించదు. నా అనేదూపుతప్ప మన అనేదృష్టిలేదు. ఈవిధంగా నడకలో నాయకతలో, గుణంలో గణంలో అన్నింటిలో క్రింద చూపు అయినందువల్లనే ఆయన స్థానమూ ఇప్పటివరకు క్రిందే అయిపోయింది!

భక్తవత్సలం మొట్టమొదట సమితి అధ్యక్షుడైనప్పుడు స్వర్గీయ అల్లూరు రామిరెడ్డి రేబాల లక్ష్మీనరసారెడ్డి గారింట్లో అభినందనవిందు జేశారు. ఆ సభలో 'స్పీక్'మని స్నేహితులు బలవంతపెట్టినా భక్తవత్సలరెడ్డి స్పీకలేకపోయాడు. ఆ నన్నివేశంజరిగి రెండు దశాబ్దాలు గడిచాయి. ఇప్పుడు బ్రహ్మాండంగావుపన్యసించగలడుగాని, ఆవుపన్యాసానికి ఆ అభినందనలకు వున్నతమైన వినూత్నావకాశం రాలేదు. ఇప్పుడు పుత్తసన్మానాలు చేయడంకాదు గాని మున్ముందు అటువంటి అవకాశాలు రావాలని ఆయన భక్తకోటి కోరుకోవాలి!

## మండలాలు

(2 పేజి కొరవ)

వుంటే ఆమండలం వారికి రిజర్వుచేయవలసివుంటుంది. అయితే ఈపద్ధతిలో ఒకచిక్కువుంది. ఈప్రాతిపదికనుపాటిస్తే రిజర్వేషన్లన్నీ గూడూరు డివిజనుకే పరిమితమౌతాయి, ఉదయగిరి, వింజమూరు కావలి, ఆత్మకూరువంటి ఉత్తర తాలూకాలలో రిజర్వేషన్లకు అవకాశమే వుండదు.

ఇది రాజకీయంగా నల్లపురెడ్లకు పెద్ద అననుకూలత; అంతేకాదు- జిల్లా రెండు భాగాలలో అసంతృప్తులు తలఎత్తే ప్రమాదంకూడా వుంది, అందువల్ల రిజర్వేషన్లకు జనాభా ప్రాతిపదిక కాకుండా మరోపద్ధతిని పాటించాలని మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి సూచించారట. రాజకీయంగా తనఅనుకూలతాననుకూలతలనుబట్టి మండలాలను కేటాయించడానికి,ప్రత్యర్థులనుదెబ్బతీయడానికి ఆయనకు ఇది మంచిఅవకాశం.రేపు జి.ప.లో తనకు ఏకుమేకై కూర్చోబోతారనుకున్న స్థానిక నాయకులను తప్పించడానికి, ఆనం, నేదురుమల్లి జనార్దనరెడ్డి వంటి వర్గాలను బలహీనపరచడానికి, పరిస్థితిని చాలాజాగ్రత్తగా పరిశీలించి, ఏఏమండలాలు రిజర్వు చేయవచ్చో, ఏవి చేయకూడదో సూచిస్తూ కలెక్టరుకు త్వరలో ఆయన అనధికార నివేదిక అందించనున్నారనికూడా తెలిసింది.

ఇప్పుడున్న పరిస్థితులే మండలాల ఎన్నికలనాటికికూడా కొనసాగితే,కల్లాలో శ్రీనివాసులురెడ్డిగారి మాటకు ఎదురే లేదు. అధికారులుకూడా ఆయన మాటను వేదవాక్కుగా స్వీకరించక తప్పదు. ఆ పద్ధతులను సమర్థించుకోవడానికి, గతంలో మునిసిపాలిటీల రిజర్వేషన్స్ పద్ధతిని మంత్రి ఉదహరించబోతారని కూడా చెప్తున్నారు.

## కరువు

(5 వ పేజి కొరవ)

మూడుగంటలన్నమాట. ఇక మిగిలిన మూడుగంటల్లో వీరు ఏమిచూసివుంటారో మీరే వూహించుకోండి!

వచ్చినదగ్గరనుంచి పరుగో, పరుగు. రేసుకార్లకన్నా స్పీడుగా పరుగెత్తాయి కార్లు. ఉరుకులు పరుగులమీద ఏదోఒక ఊరు చూడడం- ఒక్కక్షణం కారుదిగి చెరువునో, పంటపొలాలనో చూశామనిపించడం, ఒక్కోసారి కార్లలోనుంచే తొంగి చూసి, మళ్ళీ తుర్రుమని కార్లపందెం ప్రారంభించడం. ఇదీ తంతు.

వీరు తిరిగిన గ్రామాలు ఇవి-వెంకటగిరి, బంగారుపేట, చెన్నసముద్రం, నాగవోలు,డక్కిలి, మర్లగుంట, సిద్ధవరం, బొజ్జనపల్లి, యేపినాపి, తాటిపల్లి, వరదూరు, దాదూరు, ఆదూరుపల్లి, కలువాయి, సోమశిల, ఉప్పలపాడు అనంతసాగరం, బొమ్మవరం, దుండులూరు, తిమ్మనాయుడుపేట, బాట బ్రాహ్మణపల్లి బూదవాడ, ఏపిలిగుంట, నందిపాడు,ఉదయగిరి, గండిపాళెం, పెద్దిరెడ్డిపల్లె, నార్త్‌కొండాయపాళెం, నార్త్‌కృష్ణమరాజుపల్లి. విరువూరు మధ్యలో రాపూరు వెళ్లి భోజనంచేశారు, ఎమ్మెల్యేలాదులతో ముక్తసరిగా ముచ్చటించారు విరువూరు నుంచి పామూరుచేరి ప్రకాశం జిల్లా పర్యటన ప్రారంభించారు. అక్కడా ఒక 30 గ్రామాలు పరిశీలించి రాత్రి 9 గంటలకు హైదరాబాదెక్స్‌ప్రెస్ ఎక్కి వుంటారు.

కరువు బృందాల పర్యటనలు ఎంత ప్రహసనాలుగా తయారౌతున్నాయో చూడండి! ★

## ఊరు పేరు

(4 పేజీ కొరవ)

నీరుచేరి, పాలవలె తెల్లగా కన్పించడం చేత పాలిచర్ల అని ఏర్పడింది.

వెలిచెర్ల : (గూడూరు తాలూకా) వెలి అంటే తెల్ల. పై అర్థంలోనే ఈ గ్రామానికి పేరు ఏర్పడ్డది.

కురుచెర్లపాడు : (గూడూరుతాలూకా) కురు అంటే చిన్న. చిన్నచెరువులపాడు. అవి ఈగ్రామం కనుమూరుకు 3 మైళ్ళ దూరంలో వుంది.

గులిమిచెర్ల : (రాపూరు తాలూకా) గులిమిడిచెట్టు అంటే కోకిలాక్షం చెట్టు. ఈ గ్రామ చెరువుకట్టమీద వుండడంవల్ల ఈ పేరు ఏర్పడింది.

తామరచర్ల : (రాపూరు తాలూకా) చెరువులో తామరచెట్లుండేవట. అందుకని ఈ పేరొచ్చింది.

తెగచర్ల : (రాపూరు తాలూకా) పెంచల కోన సమీపంలోవుంది. పెంచలకోన కొండలపాదభాగంలోవుండి గ్రామచెరువు తరచుగాతెగుతుండినందువల్ల, తెగేచెరువై వ్యవహారంలో తెగచర్ల అయింది.

చౌకచర్ల : (కావలి తాలూకా) పద్మనాభ సత్రం, రామతీర్థం మార్గంలోవుంది. చౌక అంటే ఇంగ్లీషు అర్థం చీప్. చిన్న చెరువని అర్థంచెప్పుకోవచ్చు. 1865లో కనిగిరి రిజర్వాయర్ ఏర్పడిన తర్వాత ఇది ఫీడర్ చెరువై పెద్దచెరువైంది.

—నాపెంటపర్తి కృష్ణరావు

ఎగ్జిక్యూటివ్ ఇంజినీరువారి కార్యాలయము

పంచాయితీరాజ్ శాఖ-నెల్లూరు

## టెండరు నోటీసు

నం. 3/86-87 — 5-5-86 తేది

ఈ క్రింద తనుపరచిన స్టీలు సరఫరాచేయుటకు టెండర్లు కోరబడుచున్నవి. టెండర్లు 14-5-86 న 3-30 గం. వరకు స్వీకరించి అదే రోజున 4 గం॥కు టెండరుదారుల సమక్షమున తీయబడును.

| | | | |
|---|---|---|---|
| 1) | 6 ఎం ఎం | (ఎం ఎస్ రౌండ్స్) | 2 టన్నులు |
| 2) | 8 ఎం ఎం | (టార్ స్టీలు) | 5 టన్నులు |
| 3) | 10 ఎం ఎం | (టార్ స్టీలు) | 5 టన్నులు |

షరతులు : 1) ప్రతి టెండరుదారు రు. 1500/- ధరావత్తు బ్యాంకు ద్వారా చెల్లించవలెను. 2) అన్ని టాక్సులు కలుపుకొని రేటును ఉదహరించవలయును 3) స్టీలు నెల్లూరు పంచాయితీరాజ్ గోడౌనుకు చేర్చవలెను 4) స్టీలు 11 మీటర్ల పొడవు కలదై వుండవలెను 5) స్టీలు సరఫరాచేయునప్పుడు టెస్టింగు సర్టిఫికేట్ జతపరచవలయును.

ఎం. సుబ్రమణ్యంరెడ్డి

ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు



"పరిచయం"లో అమల

# కొనుగోలుదార్లు కళ్ళుతెరిచారు- నిర్మాతలే భ్రమలోవున్నారు!

ఏదోవిధంగా హంగులతో కొనుగోలుదారులను ఆకట్టుకొని, పెట్టినడబ్బుకు త్వరితంగా లాభాలు గడించడానికి తలాతోకాలేని కథలతో చిత్రాలు నిర్మించిన కొందరికి చుక్కెదురైంది. కొనుగోలుదారులకు పిక్చర్‌చూపిస్తే బాగుంది, తర్వాత మాట్లాడుదాం," అనిచెప్పి, థియేటర్ నుంచి వెళ్ళిపోతున్నారేగాని మళ్ళీ ఆ నిర్మాతల ఛాయలకు రావడంలేదు. ఇటీవల ఒకచిత్రాన్ని కేవలం బిజినెస్‌కోసం 36 ప్రొజెక్షన్లు ఏర్పాటుచేసినా ఫలితం లేకపోయింది. ఇదివరకు చెట్టుపేరుచెప్పి కాయలమ్ముకున్నట్లు హీరో పేరుతో పిక్చర్లు అమ్ముకునేవారు. ఇప్పుడది కూడా వీలుపడడంలేదు. కొనుగోలుదార్లు మాత్రం ఎంతని పోగొట్టుకుంటారు? ఒకప్పుడు కాకపోయినా - మరొకప్పుడైనా కళ్ళుతెరవకతప్పదు ఇప్పుడదే పరిస్థితి వచ్చిపడింది.

ఈవిషయంతెలిసికూడా కొందరు వరుసగా తమచిత్రాలకుపూజలుచేసేసుకుంటున్నారు. ఆర్టిస్టులముందు ఎక్కువమొత్తం ఒమ్మరించి, కాల్‌షీట్లు సంపాదించి రీళ్ళుచుట్టేస్తున్నారు. వీళ్ళ చిత్రాలకు మోక్షం చెప్పేదు? ఎందుకీపరుగు?

విదేశాలకు కప్పల కాళ్ళు ఎగుమతి చేసే ఒకాయన కొన్నిలక్షలుసంపాదించి నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకోడానికి సినిమాతీయడమే మంచిదన్న ఒకరి సలహాతో మద్రాసొచ్చిపడ్డాడు. "మీకు మాంచిపిక్చర్ తీయించిపెడ్తా నాకు పదిపైసల వాటాయిచ్చి, ప్రొడక్షన్ కంట్రోలర్‌గా వేసుకుంటే," అంటూ ఒక ప్రొడక్షన్ మేనేజర్, ఆ కొత్త నిర్మాతను వల్లో వేసుకున్నాడు. తన గుప్పిట్లో రచయితలు, తారలు, సాంకేతిక నిపుణులు ఉన్నట్టునమ్మించి, వాళ్ళందరికీ ఎక్కువసొమ్ము ముట్టజెప్పించి, హడావిడిగా స్క్రిప్టు గాయించి, ఆర్టిస్టుల కాల్‌షీట్లు సంపాదించి, త్వరలోనే షూటింగ్‌ప్రారంభించబోతున్నారుకూడా. చివరికి మసాలాలతో ఒక చిత్రం రూపొందుతుంది. దాన్ని కొనేవాడెవడు?

ఇలాంటి కొత్త నిర్మాతలకు బుద్ధిచెప్పేవారెవరు? ప్రేక్షకులే!

**సినిమా**
★
**మా మద్రాసు ప్రతినిధి**

### ఒకేమూస కథతో నాలుగు చిత్రాలు

హీరో ఒక యువతికి మనసిస్తాడు; పరిస్థితుల ప్రభావంవల్ల మరో యువతిని మనువాడుతాడు. చివరికి ఒక హీరోయిన్ త్యాగం చేస్తుంది; లేక చచ్చి ఊరుకుంటుంది. ఈ ట్రయాంగిల్ లవ్ ప్రాతిపదికగా నాలుగు చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి! ముందు ఏది విడుదలవుతుందోగాని, ఆ తర్వాత విడుదలయ్యే మూడు చిత్రాలూ దెబ్బతినక తప్పదు. ఇదే ఇతివృత్తంగల చిత్రాలు గతంలో కూడా ఎన్నో వచ్చాయి. అయినా, నిర్మాతలు ఎందుకు తీస్తున్నారంటే అనుకోకుండా ప్రధాన పాత్రధారుల కాల్‌షీట్లు దొరకడం; రెడిమేడ్ కథలు ఉండడం. ఇంకో తమాషా ఏమిటంటే. పై నాలుగు చిత్రాలలో రెండిటికొకరే రచయిత!

### మార్నింగ్‌షోలకు శతదినోత్సవమా?

ఈ మధ్య మద్రాసులో అయిదు చిత్రాల శతదినోత్సవాలు జరిగాయి. వాటిలో ఒక చిత్రం మాత్రం మార్నింగ్ షోలుగా వందరోజులు పూర్తి చేసుకుంది. మరి, శతదినోత్సవం ఎందుకు జరిపారంటే, సినిమా వారపత్రికలో మాంచి పబ్లిసిటీ వచ్చి, బానర్ విలువ పెరిగి, కొత్తగా ప్రారంభించే చిత్రానికి వెంటనే బిజినెస్ అయిపోతుందని! పాపం, ఆ నిర్మాత శతదినోత్సవం కోసం ఖర్చుపెట్టిన డబ్బు అంతా వృథా అయింది. కొత్త చిత్రానికి ఏ కొనుగోలుదారూ అడ్వాన్సు ఇవ్వలేదు. "ఒకవేళ ఈ చిత్రం నిజంగానే వందరోజులు రెగ్యులర్ షోలుగా ఆడి శతదినోత్సవం చేసుకుందనుకున్నాం. తదుపరి చిత్రంకూడా ఇంతబాగా ఆడుతుందని నమ్మకమేమిటి?" అని ఒక కొనుగోలుదారుడు ఆ లాగుడు శతదినోత్సవ చిత్రం నిర్మాత ముఖంమీదే అడిగేశాడటకూడా. "మేమూ, ప్రజలూ ఇక్కడ మీరనుకుంటున్నంత అవివేకులంకాము," అని మరో కొనుగోలుదారుడు లాగి లెంపకాయ కొట్టినట్లు అన్నాడట. కాని, ఆ నిర్మాత ఏం బాధపడలేదు, నవ్వి ఊరుకున్నాడు. కొత్త చిత్రాన్ని ప్రారంభించాడు.

-కొరవ 11వ పేజీలో

## శ్రీదేవికి దేవానంద్ ఉద్వాసన

దేవ్ ఆనంద్ గత నవంబర్‌లో శ్రీదేవిని తన హిందీచిత్రంలో బుక్‌చేసుకున్నారు. అడ్వాన్సుకూడా ఇచ్చారు. కాల్‌షీట్లు అడిగితే, కొన్ని నెలల తర్వాత ఇస్తానంది. కాని, వరుసగా మరికొన్ని కొత్త చిత్రాలలో బుక్ అయి, వాటిల్లో ఇప్పుడే నటించనారంభించింది. దేవ్ ఆనంద్ ఆమెను కలుసుకుని, "నాదగ్గర అడ్వాన్సుపుచ్చుకున్న తర్వాత ఇతర నిర్మాతలకు డేట్స్ ఇచ్చారు. మరి, నా కాల్‌షీట్ల మాటేమిటి? పోనీ, సాయంకాలం పూటనైనా నేను షూట్‌చేస్తాను. వెంటనే కాల్‌షీట్లు ఇవ్వండి" అని అడిగారు. ఆమె అప్పటికీ నిరాకరించేసరికి ఆమెను తొలగించి, మరో హీరోయిన్‌తో షూటింగ్ జరిపే ప్రయత్నాలలో వున్నారు. ఇలా మరి కొందరు బొంబాయి నిర్మాతలకుకూడా శ్రీదేవిమీద మోజు తగ్గిపోతూంది. చివరికామెకు తెలుగు, తమిళ చిత్రాలే గతికాని, దేవ్ ఆనంద్ చిత్రాన్ని వొదులుకున్నందుకు మాత్రం శ్రీదేవి చాలా బాధపడుతోందట.

బాగుంది, చూడండి!

## నిరీక్షణ

**చిత్ర సమీక్ష**

మనకున్న అతి కొద్దిమంది మంచి దర్శకులలో బాలు మహేంద్ర ఒకరు. చేసేది వ్యాపారమైనా, చౌకబారుతనం లేకుండా చిత్రాలు తీయడంలో నేర్పరి ఆయన. బాపు వలెనే తనచిత్రంలోని ప్రతి సన్నివేశాన్ని కళాత్మకంగా, వాస్తవికతకు దగ్గరగా తీర్చిదిద్దడం బాలు మహేంద్ర ప్రత్యేకత, ఆయన వ్యాపారం తమిళరంగంలోనే కేంద్రీకృతమైనా, తెలుగులో కూడా అడపాదడపా ఒకటి రెండు చిత్రాలు వస్తుంటాయి. అట్లా వచ్చిందే- నిరీక్షణ.

కొండకోనల్లో నాగరికత వెర్రితలల నీడలు ఇంకా పాకని అరణ్యప్రాంతంలో ఒక అమాయకపు ఆడపిల్ల ప్రేమ, జనారణ్యం వంటి నగరంలో సమాజ విషవృక్షం కాచిన కుక్కమూతి పిందెలవంటి పోలీసువ్యవస్థ దౌష్ట్యం- ఈ రెండింటి మధ్య నలిగిపోయిన ఒక యువకుడి కథే నిరీక్షణ.

కథంటూచెప్తే నాలుగుపంక్తులుచాలు. మురళి అనేఫారెస్టాఫీసరు ఉద్యోగంమీద అడవికి వెళ్ళి, ఆడపిల్లనొకదానిని ప్రేమించడం అది; పెళ్ళిగా పరిణమించే లోగా పోలీసులచేతిలో అన్యాయంగా ఇరుక్కోవడం; అక్కడ జరిగిన ఒక తొందరపాటు సంఘటనకు శిక్షగా జైలుపాలుకావడం; తిరిగి బయటకొచ్చిన తర్వాత, సంవత్సరాల తరబడి తనకోసం నిరీక్షిస్తున్న ఆడపిల్లను కలుసుకోవడం ఇంతకథ.

-కొరవ 11వ పేజీలో

# నా మాట

ఉన్నతాధికారులువస్తే వెంటనేవుండాలి; బావులు త్రవ్వించాలి; బడులు తెరిపించాలి. ఇళ్ళుకట్టించాలి; రోడ్లువేయించాలి; అప్పులు ఇప్పించాలి; పట్టీరీలు పంచాలి; చౌకడిపోలు పెట్టించాలి; ఎవరైనా అంటంతింటే పట్టుకోవాలి: జి. ప., ప్లానింగ్ బోర్డువంటి సమావేశాలుచూడాలి; సవాలక్ష కమిటీలను నెలకొల్పాలి; వాటి నిర్వహణ పర్యవేక్షించాలి.... విశ్రాంతి వుండదు, సంసారసుఖం అసలేదు; చూసే వారికి మనసే అనిపిస్తుంది-వస్తురాదాయా ఈ గొడ్డుచాకిరీలని; ఇక చేసేవారి మానసికస్థితి ఏమిటో ఊహించుకోవచ్చు.

మన కలెక్టర్ జన్నత్‌హుస్సేన్ విషయమేచూడండి. ప్రొద్దున లేచినదగ్గర నుంచి అర్ధరాత్రివరకు ఒకటే పరుగు.... పరుగు; రోజుకు ఎన్నివందలఫైళ్ళు పరిష్కరించాలో లెక్కేలేదు.

కేంద్ర బృందం కరువుపర్యటన విషయం చూస్తేచాలు- కలెక్టర్లు ఎంతటి కష్టాలెదుర్కొంటున్నారో అర్థంచేసుకోవడానికి. 8 వ తేది పర్యటన- కలెక్టరు 4 తేది నుంచే వారు వచ్చిపోయే దారిలో రెండుసార్లు తిరిగారు. వెంకటగిరి నుంచి ఉదయగిరిదాకా మండుటెండలో తిరిగి, పరిస్థితి స్వయంగా పరిశీలించి, సాయంత్రానికి ఆఫీసుకుచేరి అర్ధరాత్రి వరకు నోట్సు తయారుచేశా రాయన. రాత్రి 12 గంటలకు ఫోన్‌చేస్తే ఆఫీసులోనే వున్నారు; ఉదయం ఏడింటికి చేస్తే బయల్దేరి వెళ్ళిపోయారు. ఎంత త్రిప్పట? ఎంతశ్రమ? ఎంతయాతన?

కలెక్టరు ఇంత చాకిరీ చేస్తే వచ్చే నిధులు ఖర్చుపెట్టేది పి. డబ్ల్యు. డి., పంచాయతీరాజ్ ఇంజనీర్లు. ఈ రెండు శాఖలకు నిధులొస్తే- అధికారులకెంత పండుగో, ఎంత లాభమో మనకు తెలిసిందేకదా! అయితే ఆ శాఖ ఉన్నతాధికారులు మాత్రం కరువుబృందం పర్యటనకు ముందు, పరిస్థితిపరిశీలనకు కలెక్టరు పిలిచినా రాలేదట. చాకిరీఒకరిది- సోకు ఇంకొకరిది!

నాకు మాత్రం కలెక్టర్‌నుచూస్తే- జాలేస్తుందండీ!

• • •

తెలుగుదేశం టౌన్‌కమిటీ తగాదాలు కత్తులుదూసుకునే స్థాయికిచేరుకున్నాయి. మొన్నొకరోజు జి. ప. అతిధిగృహంలో రమేష్‌రెడ్డి వర్గీయులు, ఆయన ప్రత్యర్థులు కత్తులు కటార్లు చేతపట్టుకొని ఉరిమురిమి చూసుకున్నారట. ప్రక్కన వుండేవారు సర్దుబట్టి సరిపోయింది కాని లేకుంటే పచ్చ చొక్కాలు ఎర్రబారివుండేవని చెప్పారు.

ఈ రచ్చలుచూసి జిల్లా అధ్యక్షుడు శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, పిట్టపోరు పిల్లి తీర్చినట్టు టౌన్‌కుకూడా తానే అధ్యక్షుణ్ని ప్రకటించుకున్నారట.

అసలుపార్టీ పదవులకు, అందులోనూ టౌన్‌కమిటీవంటి అల్పస్వల్ప పదవుల కోసం తెలుగుదేశం సభ్యులు తన్నుకు చావడంలోని మర్మమేటి? ఇప్పట్లో ఎన్నికలుకూడా ఏవీలేవు-ఎమ్మెల్యే టిక్కెట్టుకు దీన్ని నిచ్చెనగా వాడుకోవాలనే భ్రమలో వున్నారనుకోవడానికి! కమ్యూనిస్టుపార్టీల వలె పార్టీహోదాలు పెత్తనంకాని, విలువ కాని సమకూర్చిపెట్టే అవకాశం తెలుగుదేశంలోలేదు! తీతిభత్యాలు, నౌకర్లు చాకర్లు వుండరు. టౌన్‌కమిటీ అధ్యక్షులకు ఎమ్మెల్యేలో, సమితి అధ్యక్షులో, మరొకరో అణగిమణగివుండే అలవాటే లేదు ఆ అవసరమూ కాదు. మరి ఇలు వింటిదేపేతలం, ఈ పదవులకోసం

(1 వ పేజీ తరువాయి)

ఇంతగా ఎందుకు ప్రాకులాడుతున్నట్లు!

అధికారులను భయపెట్టడానికి, అన్యాయపువనులు దబాయించి చేయించుకోవడానికి పార్టీహోదాలను పెద్దఆయుధాలుగా వాడుకోవచ్చునన్నది వీరి ఆశంటారు; నిజమేనా?

★

## అండర్ బ్రిడ్జి

(1వ పేజీ తరువాయి)

సగంగా విడదీసి రెండుగుల లోతున 200 మీటర్ల పొడగున కాలువ వలె త్రవ్విపారేశారు అంతకంటే ఎక్కువే లోడేసేవారేకాని. తమ డ్రైనేజీ పైపులు పగిలిపోతున్నాయిబాబో అంటూ సింహపురి హోటల్ యజమానులు మొరపెట్టుకున్నారట: ఇంజనీర్లుచెవికెక్కించుకోకపోవడంతో వారు హైకోర్టు స్టే తెచ్చుకున్నారు; పని నిల్చిపోయింది.

ఇక్కడ వింతైన, విడ్డూరమైన విషయమేమిటంటే - రోడ్డుత్రవ్వితే, లోపల డ్రైనేజి పైపులుంటాయనిగాని, టెలిఫోన్ కేబుల్స్ నడుస్తుంటాయనిగాని, మునిసిపల్ కొళాయిగొట్టాలు బిగించివుంటాయని కాని మహాఘనతవహించిన ఆర్ అండ్ బి. అధికారులకు తెలియనే తెలియదట. త్రవ్వినతర్వాత "లంకెబిందెల" మాదిరి ఇవి బయటపడితేవారు గొప్పగా "ఆశ్చర్యం" చెందారట. అయినా వాటి కోసం తమపని మానుకోవడం వారికిష్టం లేదట: తామనుకున్నప్రకారం రోడ్డు త్రవ్వితీరాలట. తాము భోగం అనుభవిస్తున్న హోదాలకేకాదు-తాము చదివిన ఇంజనీరింగ్ చదువులకుకూడా సిగ్గుపోయేట్లు పరువుతీసేట్లువుంది అధికారుల ప్రవర్తన.

డ్రైనేజి పైపులు, కేబుల్స్ ఫలితంగా పని నిల్చిపోయింది. సింహపురి హోటల్ వాళ్ళు, ఇతరత్రా ప్రైవేటుస్థలం కొనుక్కొని, పైపులు నడుపుకోవాలేతప్ప తమకేమీ సంబంధంలేదని మునిసిపాలిటీ తేల్చిపారేసింది. ఆర్ అండ్ బి అధికారులలో ఒకరు-టెలిఫోన్ కేబుల్స్‌త్రవ్వి ప్రక్కనపారేసి పని కొనసాగించమని హుకుం జారీచేశారట కాంట్రాక్టరుకు. అదేజరిగితే నష్టం కొన్నిలక్షలలో వుంటుంది. అంత ప్రమాదంలేకుండా డి.ఇ.టి గారు కేబుల్సును తమకు తాముగా తొలగించి ప్రక్కన కొత్తగావేస్తున్నారు.

అసలింత త్రవ్వి బ్రిడ్జికి రోడ్డువేస్తే వానాకాలం నీళ్ళు పోందానికి వసతి వుంటుందా అన్నది ప్రశ్న? ఇప్పటికీ, నెల్లూరు ఆర్ అండ్ బి ఇంజనీర్ల 'తెలివి'కి సాక్షిగా అండర్ బ్రిడ్జి శాశ్వతంగా నిల్చివుంది ఇప్పుడు దానికి ఇది తోడౌతుంది. నీళ్ళు తోడడానికి 4 లక్షలు పెట్టి పంప్‌హౌస్ కడ్తున్నారటగాని, వానలు ముదిరి కరెంటుపోతే అటెందుకుపనికిరాదు రోజుల తరబడి మద్రాసు- విజయవాడల మధ్య ట్రాఫిక్ నరకయాతన కల్పి వస్తుంది.

ఈ ప్రమాదం పూహించి రైల్వే ఛీఫ్ ఇంజనీరు బ్రిడ్జి క్రింద రావాల్సిన ఒకటి న్నర అడుగుల బీమ్ ను తొలగించి డిజైన్ మార్చిందారట. దీని ప్రకారం గొడ్డు అరంగులాలు లోతుతీస్తేచాలు. అప్పుడు డ్రైనేజి సమస్యకూడా వుండదు. అయితే ఆర్ అండ్ బి ఛీఫ్ ఇంజనీరు ఇందుకు గ్రీన్ సిగ్నల్ ఇవ్వలేదని తెలుస్తూంది;

కలెక్టరు, నెల్లూరు ఆర్ అండ్ బి అధికారులు చొరవతీసుకొని: ఉన్నతాధికారులను ఒప్పించి అయినా బ్రిడ్జి డిజైన్ మార్పించడం అవసరం. లేకుంటే బ్రిడ్జి నిర్మించీ దండగౌతుంది.

అసలు, ఇంత ప్రాధాన్యత కలిగిన పనివిషయంలో అధికారుల అలసత్వం వల్ల, వేలాది వాహనాలు ఇబ్బందిపడవలసిరావడం అన్యాయంకాదా? దీనికి కారకులైన అధికారులను శిక్షించడం సమంజసంకాదా?

★

## పంచాంగం

### వైశాఖమాసం

మే 9 వ తేది నుండి జూన్ 7 వ తేది వరకు వైశాఖమాసం.

### నిజకర్తరి

మే 11 వ తేది వైశాఖ శుద్ధ తదియ ఆదివారంనుండి మే 28 వ తేది వైశాఖ బహుళ పంచమి బుధవారం వరకు నిజకర్తరి.

### కృత్తిక కార్తె

మే 11 తేది పగలు 12-57 గంటలకు కృత్తిక కార్తె ప్రవేశం. అనావృష్టి.

### ముహూర్తములు

మే 29, 30 జూన్ 1, 2 తేదులలో వివాహములు మరియు గృహవాస్తు శుభ కార్యములు ఆచరించవచ్చును.

### మే తిథులు

10 శని విదియ పూర్తి.
11 ఆది విదియ ఉ. 5-53 గం. వ.
12 సోమ తదియ ఉ 7-52 గం. వ.
13 మంగళ చవితి ప 9-41 గం వ.
14 బుధ పంచమి ప. 11-35 గం వ.
15 గురు షష్ఠి ప 12-11 గం. వ.
16 శుక్ర సప్తమి ప. 1-01 గం. వ.

—నిమ్మగడ వేంకటేశ్వరశాస్త్రి

# జిల్లావార్తలు

(గవ పేజీ తరువాయి)

...ను ప్రతిసంవత్సరం [illegible] వివరించు [illegible] రహితంగా, [illegible] రైతులు [illegible] చెప్తున్నారు. హాహాకారాలు చేస్తున్నారు.

[illegible] వరాలు కాకుంటే [illegible] కానీ రైతు [illegible] కూడా గమని [illegible] వారి [illegible] ఎక్కువగా నష్టపోయేది రైతు: [illegible] చేపట్టే సహాయ కార్యక్రమాలలో [illegible] వ్యవసాయ [illegible]: ప్రభుత్వం వీటికి చెల్లించే [illegible] రూపాలలో రైతుకు చెల్లి [illegible] మరి, ప్రభుత్వం రైతుకు నష్టపరిహారం కట్టివ్వకపోతే [illegible] గొంతిమీద [illegible] అవసరం కాదా? [illegible] మానవతా దృక్పథమైనా [illegible]

[illegible] రైతు [illegible] చేసి అయినా రైతును [illegible]

## కాకర్లపాడు

## దేవుళ్ల నెత్తుకుపోయారు

[illegible] కాకర్లపాడు [illegible] దేవాలయంలోని [illegible] దేవుళ్లను దొంగెత్తుకుపోయారు. ఈ దేవుళ్ళ వెల, సుమారు మూడువేలట.

## వాసిలి టీచర్ బదలీ.

## జి.వి. ఛైర్మెన్ అన్యాయం!

వాసిలి హైస్కూలు టీచరు ఎల్. వెంకటేశ్వరరెడ్డిని బదలీచేసి రెండు నెలలు నిండకముందే తిరిగి ఇక్కడికి రప్పించారట.

ఈ ఉపాధ్యాయుడు స్కూలుకు పొత్తుగా రాకుండా, రైస్‌మిల్లు నడుపుకుంటూ, పిల్లలకు ఉపాధ్యాయులకు మధ్య తుంపులు పెడ్తూ స్కూలును భ్రష్టుపట్టించాడని అలజడి రేగింది. గ్రామస్థులందరూ ఏకాభిప్రాయంగా, ఇతడ్ని సాగనంపమని కోరారు. డి.ఇ.ఓ. పిలిచి వచ్చి చూసి, ఆరోపణలన్నీ నిజమని నిర్ధారించి చింతలమ్రికి బదలీచేశారు; అయితే అప్పటి జి.వి. ఛైర్మెన్ శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి [illegible] చేయకుండా వెనక్కి రప్పించారట.

ఛైర్మెన్ గారు - గ్రామమంతా [illegible] [illegible] చేసింది తప్పు: [illegible] సవరించుకోండి!

## పారి నృత్యం

శ్రీహరికోటలోని షార్ రిక్రియేషన్ క్లబ్ 8 తేదీ కుమారి వర్దాని ఆవర్త నృత్య కార్యక్రమం ఏర్పాటు చేసింది. క్లబ్ తరఫున శ్రీ ఇ. టి. రామారావు స్వాగతించారు: శ్రీ బి.టి.ఎ. రామారావు [illegible] శ్రీ జె. ఎం. హుస్సేన్ వందనాలు చెప్పారు.









జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |



సంపాదకుడు [illegible] నెల్లూరు [illegible] 17/170 [illegible] నెల్లూరు 524001